Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

కల్లా కపటము కానని వారికి...

పంపినవారు:
డి. ఎల్. సరోజిని - నిజామాబాద్

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు



ఇవిగాక రంగుల బొమ్మ కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు, విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.







## సిక్స్-20 కోడక్ 'జూనియర్' I కెమేరా

వాడుటకు ఒక బాక్సు కెమేరా అంతలా సులభము. మరియు తీసుకొనిపోవుటకు వీలుగా మడత పెట్ట వచ్చును. చక్కని ఆధునికమైన డిజైను: 'కోడక్' 620 ఫిల్మ మీద 2¼" x 3¼" సైజులో ఎనిమిది స్నేపులు వచ్చును. ... ... రు. 76/-
తోలు కేసు ... ... రు. 9/8





## కోడక్ 'రెటినెట్' కెమేరా

త్వరితమైన f/3.5 లెన్సు. కాంపర్ రేపిడ్ షట్టర్ (1/500); ఎక్స్పోజర్ సులభము చేయుటకు క్రొత్త 'లైట్-వేల్యూ' సెట్టింగులు. మీ బొటనవ్రేలితో నొక్కితే షట్టర్ సరిచేసి, ఫిల్మను చుట్టి ఎక్స్పోజర్లను లెక్కపెట్టును. 'కోడక్' 135 బ్లేక్ అండ్ వైట్ లేక రంగు ఫిల్మ (35 మి.మీ) మీద 36 లేక 20 చిత్రములు. ఎవర్-రెడీ కేసుతో సహా రు. 250/-
ఫ్లాష్‌హోల్డర్ ... రు. 47/8

## కోడక్ 'రెటినా' Ib కెమేరా

ఘనమైన f/2.8 కోటెడ్ లెన్సు. అన్ని రంగులను గ్రహింపగలదు. సింక్రో-కాంపర్ షట్టర్ (1/500); క్రొత్త లైట్-వేల్యూ సెట్టింగులు. తక్షణమే ఫిల్మ చుట్టుకునే, షట్టర్ రీసెట్ చేసే ఏర్పాటు దీనిలో కలదు. 'కోడక్' 135 బ్లేక్ అండ్ వైట్ లేక రంగు ఫిల్మ (35 మి.మీ) మీద 36 లేక 20 చిత్రములు. ఎవర్-రెడీ కేసుతో సహా రు. 380/-
ఫ్లాష్‌హోల్డర్ ... రు. 47/8

ధరలలో అమ్మకపు పన్ను చేర్చబడలేదు

K 2498

అంటే 'కోడక్' ఫిల్మునే వాడండి!


LIFEBUOY
SOAP
LIFEBUOY SOAP

నాణ్యమునకు పేరుపొందిన

## చాంపియన్

(రిజిష్టర్డు)

కలమునే ఎల్లప్పుడు కొనండి.

ప్రతిచోట దొరకును.

వెల రు. 3-8-0 నుండి పైగా

★

గుజరాత్ ఇండస్ట్రీస్

ప్రైవేట్ లి., బొంబాయి-2




Champion

The Choice of all

---

మధుర పరిమళయుతమైన

రిజిష్టర్డు

## 'లోమా'



★ కురులను నల్లబరచును.

★ మెదడునుచల్లబరచును.

★ 'లోమా' నే ఎల్లప్పుడు కొనండి.

సోల్ ఏజంట్లు : ఎం. ఎం. ఖంబట్‌వాలా

రాయపూర్ :: అహమదాబాదు

---

నకళ్లు చూచి మోసపోకండి!

మంచి సువాసన గల 'పుష్పలీలా' (రిజిష్టర్డు) & 'గణేశ్ దర్బార్' అగరువత్తులనే వాడండి.

PUSHPA LEELA AGARBATHI

పుష్పలీలా అగరబత్తి

Ganesh Durbar Bathi

పుష్పలీలా అగరబత్తి

గణేశ్ దర్బార్

నేషనల్ ఫ్లాగ్ పెర్‌ఫ్యూమరీ వర్క్సు

చింతామణి :: మైసూర్ స్టేట్

## సెప్టెంబరు 29 నుంచి ఆంధ్ర అంతటా నడుస్తున్నది!






జగ్గయ్య, రేలంగి, చలం, గుమ్మడి, జి. వరలక్ష్మి, కృష్ణకుమారి, సూర్యాకాంతం, సురభిబాలసరస్వతి వగైరా నటించిరి.

సంగీతము : రాజేశ్వరరావు ✶ దర్శకత్వం : సుబ్బారావు,

కథ, పాటలు, మాటలు : సముద్రాల సీనియర్, జూనియర్

## "ఎ" పిల్సు

చంటిబిడ్డలు తమకు తెలియకనే రాత్రిళ్లు మూత్రం విడుస్తారు. ఈ మందు సేవించటం వల్ల, మానసికంగాగాని శారీరకంగాగాని ఎట్టి చెరుపు లేకుండా, పైబాధ నివారణగును.

మోతాదు:—రోజూ మూడుసార్లు, తడవకు రెండేసి బిళ్లల చొప్పున, మంచినీళ్లతో పుచ్చుకోవాలి.

100 బిళ్లలు గల సీసా ఒకింటికి రు. 3-0-0

## "డెన్-టానిక్"

ఈ మందువల్ల బిడ్డకు సులువుగా, సుఖంగా పళ్లు మొలచును. బిడ్డకు మంచి నిద్రపట్టి, చక్కగా ఆకలివేసి, సుఖవిరేచనమగును.

మోతాదు:—రోజుకు మూడుసార్లు, తడవకు మూడేసి మాత్రల చొప్పున, మంచినీళ్లతో.

150 మాత్రల సీసా ఒకింటికి రు. 1-8-0

హెూమియో లెబోరేటరీ
178, న్యూ చార్నీ రోడ్డు,
గిర్గాం, బొంబాయి-4.

# మమీ దుగ్ధాన్నం

నెదర్ల్యాండ్స్‌లోని పచ్చికబయళ్లలో పెరిగిన మేలురకమైన ఆవుల స్వచ్ఛమైన పాలతో చిన్నపిల్లల కొరకు ఇది తయారు చేయబడింది. 'మమీ'లో 'డి' విటమిన్‌లు ఉన్నాయి.







సోల్ డిస్ట్రిబ్యూటర్:
ఎమ్. ఏ. మల్లిక్ అండ్ కంపెనీ
91, మహమ్మద్ అలీ రోడ్, బొంబాయి-3.




## ఆంధ్రుల చరిత్ర సంస్కృతి

ప్రతి ఆంధ్రుడు చదువదగిన సద్గ్రంథము. ఆంధ్ర రాష్ట్ర సాధనకు మిక్కిలి తోడ్పడిన గ్రంథము.

పే. 500. వెల రు. 6 0 0




## బాలసరస్వతి పిక్టోరియల్ మీడియం డిక్షనరి

(ఇంగ్లీషు-ఇంగ్లీషు-తెలుగు)

విద్యకు, విజ్ఞానానికి, పరీక్షలో విజయానికి ఈ డిక్షనరీ వుపయోగపడుతుంది. 1000 పేజీలు. పూర్తిక్యాలికో బైండు

మీడియం ధర 9 0 0
జెం డిక్షనరీ ధర 4 8 0




## గానకళాబోధిని

అపూర్వ సంగీత గ్రంథము. గొప్ప అనుభవజ్ఞులచే రచింపబడినది. సంగీతము నేర్చుకొనుటకు, సాధనకు, పరీక్షలకు పిన్నలకు పెద్దలకు ఉపయుక్తపడు గ్రంథరాజము.

పే. 1000. రు. 10 0 0

తమ ఆర్డరుతోపాటు అడ్వాన్సు పంపగలరు.

వలయువారు: బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు.
బ్రాంచి: నెం. 6, సుంకురామచెట్టి వీధి, మద్రాసు-1

# సౌందర్యవతులు

# బిన్నీ కంపెనీ వారి

## 100% శుద్ధమైన సిల్కు

మరియు

## జార్జట్ చీరెలను
## వాడుదురు

★

అనేక ఆకర్షణీయ
మైన రంగులలో,
బార్డరులలో దొరకును

అన్ని పెద్ద షాపులలో
దొరకును.

★

తయారు చేయువారు :

ది బెంగళూరు ఉల్లన్,
కాటన్ & సిల్కు
మిల్స్ కంపెనీ లి.,
బెంగళూరు



★

Trade Enquiries from ANDHRA & ORISSA:

**H. YOOSUF OOMER & CO.,**
**DEWAN SURAPPA LANE, CHICKPET, BANGALORE CITY**

Chari

# ఇప్పుడు

## కొత్తరకపు

# టాయిలెట్ పౌడరు

## ఎల్లవేళలందును హాయిగా నుంచుటకు

భారతదేశమందు ప్రప్రథమంగా, లోకప్రసిద్ధమైన **జి-11**※ తో గూడినట్టి అతిసున్నితమైన టాల్కమ్ పౌడరు తయారుచేయబడినది....జి-11 చర్మ మచ్చలను అత్యధిక చమటను గలిగించు క్రిములను నాశనమొనర్చునట్టి ఒక్కటే ధృవపడిన మంట బెట్టని రసాయనము. ఈ అద్భుతమైన పౌడరు చర్మము తడివల్ల రేగుట, వేడికి పేలుట ఈ బాధలనుండి శాశ్వతమైన శీఘ్రవిముక్తిని గలిగించును.....

ఎల్లప్పుడూ, పనికి, ఆటలకు, షికారుకు, విందులకు వెళ్లేముందు ఈ శమనకరమైన, మనోహరమగు పరిమళము గల పౌడరును బాగా అద్దుకొనుడు....మీరు మిగుల నమ్మికగా నుందురు, చాలా ప్రీతికరముగా నుండుడు! బట్టల యందు జల్లబడేయడల, అది రాపిడిని నిరోధించును.

Godrej
రిజిస్టర్డ్

జి-11 తో గూడిన

# గోద్రెజ్ టాయిలెట్ పౌడరు




**జి-11** తో కూడిన
హెయిర్ టానిక్కు
షేవింగ్ స్టిక్కు
సింతాల్

※ వైజ్ఞానిక గ్రంథ జాబితాతో గూడిన **జి-11** గాథ (హెక్సాక్లోరోఫీన్) కొరకు, దిగువ చిరునామాకు వ్రాయుడు. గోద్రెజ్ సోప్స్ ప్రయివేట్ లిమిటెడ్, బొంబాయి - 11.



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచికనుంచీ "భువనసుందరి" అనే కొత్త సీరియల్ ప్రారంభిస్తున్నాము. "మకరదేవత" లాగే, "భువనసుందరి" కూడా త్రివర్ణ చిత్రాలతో కూడుకొని ఉంటుంది. అంటే, ఈ సంచికనుండీ "చందమామ"లో 16 పేజీల త్రివర్ణ చిత్రాలు.

ఈ కొత్త సీరియల్ "భువనసుందరి" ఒక గ్రీకు పురాణ గాథ. మనదేశంలో రామాయణ, మహాభారత, భాగవతాది పురాణాలున్నట్టే, గ్రీస్‌దేశంలోకూడా పురాణ గ్రంథాలున్నాయి. వారి పురాణాలూ, వాటిని రచించిన హోమర్ మహాకవీకూడా జగత్ప్రసిద్ధి సంపాదించారు. మన రామాయణ భారతాలలాగే, గ్రీకు పురాణాలు అనేక భాషలలోకి తర్జుమా అయాయి. హోమర్ రచించిన "ఇలియడ్" అనే గ్రంథంలోని కథే "భువనసుందరి"గా "చందమామ"లో మీరు నెల నెలా చదువుతారు.

ఈ కథకు చెందిన పాత్రల పేర్లు పాఠకుల సౌకర్యం కొరకు మార్చబడ్డాయి. కాని స్థలాల పేర్లలోగాని, కథలోగాని మార్పులేమీ లేవు. ఈ కథ చదువుకుపోయేటప్పుడు మీకు అనేక చోట్ల రామాయణ భారత కథలు జ్ఞప్తికి రావచ్చు. దీనివల్ల ప్రపంచ నాగరికత అంతా ఒకే కుదుటినుంచి వచ్చిందన్న సంగతి స్పష్టమవుతుంది.

సంపుటి 19 అక్టోబరు 1956 సంచిక 4

# అట్టమీది బొమ్మ

పంచపాండవులు కామ్యక వనంనుంచి తిరిగి ద్వైతవనానికి మారారు. వారు అక్కడ ఉన్న సమయంలో, ఒక బ్రాహ్మడు వచ్చి, "నాయనలారా, నా నిప్పు కొయ్యను ఒక దుప్పి తన కొమ్ములలో ఇరికించుకుని పారిపోయింది. నా నిప్పు కొయ్య తెచ్చి ఇచ్చి పుణ్యం కట్టుకోండి," అని కోరాడు.

వెంటనే అయిదుగురు అన్నదమ్ములూ విల్లు అంబులు తీసుకుని దుప్పి వెళ్ళిన దిక్కుగా బయలుదేరారు. కొంతసేపటికి అది వారి కంట బడింది. దాని మీదికి ఎన్ని బాణాలు వేసినా, ఒక్కటీ తగలలేదు. దుప్పి పారిపోతూ, ఆగుతూ పాండవులను కీకారణ్యం మధ్యకు తీసుకుపోయి అసలే మాయమయింది.

అందరూ అలిసి దాహంతో బాధపడుతున్నారు. నకులుడు ఒక చెట్టెక్కి కొంతదూరాన నీటిమడుగు ఉండటం గమనించాడు. అతను అందరికీ నీరు తెస్తానని బయలుదేరి, మడుగువద్దకు పోయి తన దాహం తీర్చుకోబోతూండగా "ఈ మడుగు నాది! ముందు నా ప్రశ్నలకు జవాబులు చెప్పకుండా నీరు తాగ టానికి వీలులేదు!" అన్నది అశరీరవాణి. నకులుడు ఆ మాటలు లక్ష్యం చెయ్యక నీరు తాగి మడుగుదగ్గిరే స్పృహ తప్పి పడిపోయాడు.

నకులుడెంతకూ రాకపోవటం చూసి, ధర్మరాజు సహదేవుణ్ణి పంపాడు. అతనుకూడా నీరు తాగి, స్పృహతప్పి పడిపోయాడు. తరవాత ధర్మరాజు అర్జునుణ్ణి పంపాడు. అర్జునుడుకూడా నీరు తాగి పడిపోయాడు. తరవాత భీముడుకూడా వచ్చి, నీరుతాగి పడిపోయాడు.

ఆఖరుకు ధర్మరాజు వచ్చాడు. అశరీరవాణి హెచ్చరిక విని, "మహాత్మా, నువ్వెవరు? నీ ప్రశ్నలేమిటి?" అని అడిగాడు. అశరీరవాణి ధర్మరాజును అనేక ప్రశ్నలడిగింది. అన్నిటికీ ధర్మరాజు సమాధానాలిచ్చాడు. అశరీరవాణి సంతోషించి, "ధర్మరాజా! నీ తమ్ములలో ఎవరినన్నా ఒకరిని బతికిస్తాను, కోరుకో!" అన్నది.

"మహాత్మా! మా తండ్రికి కుంతి, మాద్రి ఇద్దరు భార్యలు. కుంతీ పుత్రులలో నేను బతికివున్నాను కనక, మాద్రి పుత్రులలో నకులుణ్ణి బతికించు" అన్నాడు ధర్మరాజు. "నాయనా, నీ ధర్మబుద్ధికి చాలా సంతోషించాను. నేను యమధర్మరాజును." అంటూ యమధర్మరాజు ప్రత్యక్షమై, మిగిలిన పాండ వులను బతికించి, అంతర్ధానమయాడు.



# కర్మ పరిపాకం

బుద్ధభగవానుడి కాలంలో అనాథపిండకుడనే వైశ్యోత్తము డుండేవాడు. ఆయనకు బుద్ధుడియందు అపారమైన భక్తి. ఆయన జేతవనంలో యాభైనాలుగు కోట్లు ఖర్చు చేసి గొప్ప ఆరామం కట్టించాడు. ఆయన విధిగా రోజుకు మూడుసార్లు బుద్ధభగవానుణ్ణి చూసి వచ్చేవాడు. ఎప్పుడైనా బుద్ధుడే తన అనుచరులతోసహా ఆయన ఇంటికి భిక్షకై రావటంకూడా జరుగుతూండేది.

ఈ అనాథపిండకుడికి ఏడంతస్తుల మేడ ఉన్నది. దానికి ఏడు ప్రాకారాలు. వాటిలో మధ్యప్రాకారంమీద ఒక క్షుద్రదేవత తన సంతానంతోసహా నివాసం ఉంటూ ఉండేది. ఈ దేవతకు బుద్ధుడంటే బొత్తిగా పడదు. ఆయన తాను ఉండే ఇంటికి అప్పుడప్పుడూ వస్తూండటం ఆ దేవతకు ఎంతమాత్రం నచ్చలేదు. ఆమె మానవ స్త్రీరూపం ధరించి అనాథపిండకుడి ఖజానాదారువద్దకు వెళ్ళి, "ఈ ఇంటికి బుద్ధుణ్ణి ఎందుకు రానిస్తారు? అటువంటివాడు గడపలో అడుగుపెట్టటం ఇంటికి చెరుపు!" అన్నది. ఖజానాదారు ఆమెను తిట్టి పంపాడు. తరవాత ఆమె అనాథపిండకుడి కొడుకుదగ్గిరికి వెళ్ళి, అదే విధంగా మాట్లాడి, అతనిచేతకూడా తిట్లు తిన్నది. చేసేది లేక, అప్పటికా క్షుద్ర దేవత ఊరుకున్నది.

అనాథపిండకుడికి ఖర్చు నానాటికీ హెచ్చిపోయి, రాబడి తగ్గిపోతున్నది. ఆయన వ్యాపారం ఏమాత్రమూ చూడటం లేదు. ఇదికూడా గాక ఆయనకు ఇతరత్రా నష్టం కలిగింది. సాటి వ్యాపారస్థులు ఆయనవద్ద పద్దెనిమిది కోట్ల సొమ్ము అప్పుగా పుచ్చుకున్నారు. దానిని వాళ్ళు తిరిగి ఇవ్వలేదు, ఆయన అడగనూలేదు. మరొక పద్దెనిమిది కోట్ల ధనం బిందెలలో అచిరవతీ నదీతీరాన పాతిపెట్టిస్తే, నదికి వరదలు

వచ్చి ఒడ్లు కరిగి, ఆ బిందెలు కాస్తా సముద్రంలోకి కొట్టుకుపోయాయి.

వీటన్నిటి ఫలితంగా అనాథపిండకుడు క్రమంగా పేదవాడైపోయాడు. ఆయన భిక్షువుల కింకా భోజనాలు పెడుతూనే ఉన్నాడుగాని, వెనకటి విందులిప్పుడు లేవు.

ఒకనాడు బుద్ధభగవానుడు అనాథపిండకుడితో, "ఇంకా దానాలు చేస్తూనే ఉన్నావా ?" అని అడిగాడు.

అనాథపిండకుడు ఎంతో ఆవేదన పడుతూ, "స్వామీ, దానాలైతే చేస్తూనే ఉన్నానుగాని, నేనిప్పుడు దానం చేసేది గంజి మాత్రమే!" అన్నాడు.

బుద్ధు డాయన బాధ గమనించి, "విచారించకు, నాయనా. హృదయం మంచిదిగా ఉన్నంతకాలమూ, చేసే దానం గంజే అయినాకూడా అది మంచిదిగానే ఉంటుంది," అన్నాడు.

అనాథపిండకుడు పేదవాడైపోయాడు గనక ఇప్పుడు క్షుద్రదేవత ధైర్యంగా ఆయనవద్దకే వెళ్ళి, "ఏమయ్యా, ఈ బుద్ధుణ్ణి ఎందుకు చేరనిస్తావు? హాయిగా నీ వ్యాపారం చూసుకో. పోయిన డబ్బంతా తిరిగి సంపాదించుకో. నేను మీ యింటి నాలుగో ప్రాకారంమీద ఉండే దేవతను. నీ మంచిగోరి చెబుతున్నాను," అన్నది.



అనాథపిండకుడు ఆమెతో, "తక్షణం నా యిల్లు వదిలి వెళ్ళిపో," అన్నాడు.

"పోక కూర్చుంటా ననుకున్నావా ఏమిటి? ఇంతకన్న మంచి ఇళ్ళే దొరుకుతాయి!" అంటూ ఆ క్షుద్రదేవత తన పిల్లలమూకను వెంటబెట్టుకుని అనాథపిండకుడి ఇల్లు విడిచి వెళ్ళిపోయింది. కాని ఆమె ఎంత వెతికినా అంత మంచి ఇల్లు మరొకటి దొరకలేదు. అటువంటి ఇల్లు వదిలినందుకు ఆమెకు పశ్చాత్తాపం కలిగింది. కాని విడిచివచ్చిన ఇంటికి తిరిగి ఏ ముఖంపెట్టుకు పోవాలో తెలియక, ఆమె గ్రామదేవత సలహా కోసమై వెళ్ళింది.

"ఆ ఇల్లు విడిచి రావటం నీదే పొరపాటు. మళ్ళీ అక్కడికి వెళ్ళాలంటే ఒక పని చెయ్యి. అనాథపిండకుడికి వర్తకులు పద్దెనిమిది కోట్లు బాకీ ఉన్నారు. నువు అతడి గుమాస్తా రూపంలో వర్తకులవద్దకు వెళ్లి ఆ పద్దెనిమిది కోట్లూ వసూలుచెయ్యి. అనాథపిండకుడి ధనపు బిందెలు పద్దెనిమిది కోట్ల ధనంతోసహా సముద్రం చేరాయి. వాటిని తీసుకురా. ఫలాని చోట అనాథపిండకుడికి పద్దెనిమిది కోట్ల విలువచేసే ఆస్తి ఉన్నది. ఈ సంగతి ఎవ్వరికీ తెలియదు. ఆ ఆస్తిని అనాథపిండకుడి పరం చెయ్యి. ఆ తరవాత ఆయనవద్దకు





వెళ్ళి క్షమాపణ చెప్పుకుని, తిరిగి రానిమ్మని అడుగు," అని గ్రామదేవత సలహా ఇచ్చింది.

క్షుద్రదేవత ఆ ప్రకారమే లోకు లివ్వవలిసిన పద్దెనిమిది కోట్లూ వసూలుచేసింది, సముద్రంలోని ధనపు బిందెలను తెచ్చింది, వాటితోబాటు పద్దెనిమిది కోట్లు విలవచేసే ఆస్తినికూడా అనాథపిండకుడి కిచ్చి, "బాబూ, నాకు బుద్ధి వచ్చింది. నన్ను క్షమించి, మళ్లీ మీ ఇంట ఉండనివ్వండి," అని బతిమాలింది.

"ఈ క్షమాపణ బుద్ధభగవానుడి ఎదట చెప్పుకో!" అన్నాడు అనాథపిండకుడు క్షుద్రదేవతతో. ఆమె అనాథపిండకుడివెంట జేతవనానికి వెళ్లి, బుద్ధుడి ఎదట జరిగినదంతా చెప్పుకుని క్షమాపణ వేడింది. అంతా విని బుద్ధభగవాను డీవిధంగా అన్నాడు:

"దుష్కర్మ చేసేవాడు తన కర్మ పరిపక్వమయినదాకా తాను మంచి పనే చేస్తున్నా ననుకుంటాడు. ఫలితం అనుభవించవలిసి వచ్చినప్పుడుగాని నిజం బోధపడదు. అదేవిధంగా సత్కర్మ చేసేవాడు కూడా తన కర్మ పరిపక్వం చెందేదాకా తాను చేస్తున్నది దుష్కర్మ అనే అనుకోవచ్చు. అతనికికూడా ఫలం అనుభవించేటప్పుడే నిజం తెలిసివస్తుంది. మొదట చెప్పిన మాటకు ఈ క్షుద్రదేవతే నిదర్శనం. ఈమె తాను చాలా మంచి పని చేస్తున్నాననుకున్నది. రెండవదానికి నిదర్శనం ఈ అనాథపిండకుడు. ఈయన తాను చెడ్డపని చేస్తున్నా ననుకుంటూ ఎంతగానో విచారించాడు. కర్మ పరిపాకం అయాకనే, ఇప్పుడు ఎవరిది సత్కర్మో, ఎవరిది దుష్కర్మో బయట పడింది!"

ఈ మాటలు విన్నమీదట క్షుద్రదేవత తన బుద్ధి మార్చుకుని, బుద్ధుడియందు ద్వేషం విసర్జించి, గంపెడు పిల్లలతోసహా అనాథపిండకుడి ఇంటి నాలుగవ ప్రహరీ వద్ద యథాప్రకారం నివాసం చేయసాగింది.



# అచ్చిరాని ముహూర్తం

ఒక బస్తీలో ఒక ధనికు డుండేవాడు. అయనకొక కొడుకుండేవాడు. వాడికి పెళ్ళియీడు వచ్చింది. వాడు అందమైన పిల్లను తప్ప చేసుకోనన్నాడు. అందుచేత ధనికుడు చాలా గ్రామాలు తిరిగి ఒక గ్రామంలో ముత్యంలాటి పిల్లను చూసి పెళ్ళి నిశ్చయించి, త్వరలో ముహూర్తం పెట్టుకు వచ్చాడు. పెళ్ళిప్రయత్నాలు జోరుగా సాగుతున్నాయి.

రేపు పెళ్ళివారు బయలుదేరి పోతారనగా ఈ వార్త ధనికుడి ఇంటి పురోహితుడికి తెలిసింది. అయన వచ్చి, "అబ్బాయి పెళ్ళటగా? ముహూర్తం ఎప్పుడో?" అన్నాడు.

"రేపు రాత్రికేనండీ! ముహూర్తం మంచిదేమో చూడండి!" అన్నాడు ధనికుడు.

'తీరా ముహూర్తం పెట్టుకొచ్చి నన్నడుగుతాడా ఈ పెద్ద మనిషి?' అని పురోహితుడికి కోపం వచ్చింది. "ఎవరు పెట్టారండి ఈ ముహూర్తం? ఇది మీకు అచ్చిరాదు!" అన్నా డాయన ధనికుడితో.

ధనికుడికి భయం పుట్టింది. అప్పటికప్పు డాయన పురోహితుడిచేత ఇంకో ముహూర్తం మరి నాలుగు రోజుల అవతల ఏర్పాటు చేయించుకుని పెళ్ళి ప్రయాణం మానుకున్నాడు.

అక్కడ ఆడపెళ్ళివారు సాయంకాలందాకా చూసి, పెళ్ళివారు రాకపోయేసరికి ఊళ్ళోనే ఒక కుర్రవాడికి పిల్లనిచ్చి పెళ్లిచేసేశారు. మరి నాలుగు రోజులకు ధనికుడు తరలి వెళ్ళి పెళ్ళి అదివరకే అయిందని తెలుసుకున్నాడు.

నిరాశతో అయన తిరిగి వచ్చి పురోహితుణ్ణి పిలిచి, "ఇదేమిటయ్యా? నీ మాట విని ముత్యంలాటి పిల్లను పోగొట్టుకుంటినే!" అన్నాడు.

"అదేగదా నేను చెప్పిందికూడా! ఆ పిల్ల మీకు కాకపోవటమే అచ్చిరాకపోవటం!" అన్నాడు పురోహితుడు.



# ఆనందం

పూర్వం ఉత్తర దేశాన ఒక బ్రాహ్మడుండేవాడు. ఆయన మహా జ్ఞాని. చిన్న తనంలోనే ఆయన ఇహసుఖాలను విసర్జించి సన్యాసం పుచ్చుకుని, హిమాల యాలకు వెళ్లి తపస్సు చేసుకోసాగాడు. ఆయన కీర్తి నలుదిక్కులా వ్యాపిం చింది. ఆయనవద్ద అయిదు వందల మంది శిష్యులు చేరారు. ఇలా చేరిన వారిలో మొదటివాడు ఒక రాజు. ఆయనకూడా ప్రపంచంపై విరక్తి కలిగి సన్యసించిన వాడే.

హిమాలయాలపై మంచు పడనారంభించగానే సన్యాసి తన శిష్యులతో మైదాన ప్రాంతాలకు దిగివచ్చి భిక్షాటన చేసేవాడు. ఒక ఏడు ఆయన తన శిష్యులతో కాశీరాజ్యానికి వచ్చాడు. కాశీరాజు సన్యాసికీ, ఆయన శిష్యులకూ మంచి ఆతిథ్యం ఇచ్చి తనవద్దనే ఉంచుకున్నాడు.

వానాకాలం దాటిపోయింది. సన్యాసి మళ్లీ హిమాలయానికి బయలు దేరాడు. "మీరు పెద్దవారు. హిమాలయంమీద ఎందుకు కష్టపడతారు? మీ శిష్యులను వెళ్లిపోనివ్వండి. మీరు నావద్దనే ఉండండి. మీ తపస్సుకు ఏమీ భంగం ఉండదు," అన్నాడు కాశీరాజు. సన్యాసి సరేనన్నాడు.

శిష్యులు హిమాలయాలకు తిరిగి వెళ్ళారు. కొంత కాలమైనాక పెద్ద శిష్యుడికి గురువును చూడాలనిపించింది. ఆయన ఒక్కడే బయలుదేరి కాశీ నగరానికి వచ్చి సన్యాసిని చూసి ఆనందబాష్పాలు రాల్చాడు. తన శిష్యుణ్ణి చూసి సన్యాసికికూడా ఆనందమయింది.

వారిద్దరూ భోజనం చేసి విశ్రమించి మాట్లాడుకుంటున్న సమయంలో సన్యాసి ఉండే పర్ణశాలకు రాజు వచ్చాడు. పెద్ద శిష్యుడు రాజును చూసికూడా లేవలేదు. ఆయన తన్మయత్వంలో ఉన్నట్టుగా, "ఏమి ఆనందం! ఏమి ఆనందం!" అనసాగాడు.

ఇది చూసి రాజుకు కోపం వచ్చింది. ఆయన సన్యాసితో, "మీ శిష్యుడు షడ్రసోపేతంగా భోంచేసినట్టుందే! ఆనందం పట్టలేకుండా ఉన్నాడు" అన్నాడు.

"రాజా, నీవు పొరబడుతున్నావు. అతని ఆనందం భోజనంవల్ల కలిగి నది కాదు. అతనుకూడా నీలాగే ఒకప్పుడు రాజు. ఇహసుఖాలపై విరక్తి కలిగి సన్యసించాడు. ఆయన పొందే ఆనందం కోరికలను చంపుకోవటంవల్ల కలిగేది; కోరికలను తీర్చుకోవటంవల్ల కలిగేది కాదు!" అన్నాడు సన్యాసి.




## 16

[సముద్ర తీరంనుంచి వినవచ్చిన కేకలు ఎవరివో తెలుసుకునేందుకు వెళ్ళిన శివదత్తుడికీ, అతడి అనుచరులకూ సముద్రపు దొంగల నాయకుడైన సముద్రకేతుడు కనిపించాడు. అతడి బారినుంచి తప్పుకు పారిపోతున్న ఇద్దరు స్త్రీలు అడవిలోకి పరిగెత్తారు. వారిని వెన్నంటివస్తున్న సముద్రకేతుణ్ణి, శివదత్తుడు ఎదుర్కొన్నాడు. తరవాత—]

శివదత్తుడు, తన అనుచరులతో చెట్ల చాటుకు పారిపోయేంతలో ఒడ్డుకు చేరిన రెండు పడవలలోనుంచి కేకలు పెడుతూ కొందరు సముద్రపు దొంగలు కిందికి దిగారు. బాగా అలిసిపోయిన సముద్రకేతుడు కత్తిని, అక్కడ ఇసుకలో గుచ్చి రొప్పుతూ, "హేయ్, వాళ్ళంతా చెట్లచాటుకు పారిపోయారు. ఇంతదాకా మీరేం చేస్తున్నారు?" అంటూ తన అనుచరుల్ని కసిరాడు. తరవాత, స్త్రీలు పారిపోయిన వైపుకేసి చేయి చూపుతూ, "ఒక్క ఇరవై మంది మాత్రం ఇక్కడ ఉండి, తతిమ్మావాళ్ళు ఆ ఆడదయ్యాలను వెతికి పట్టుకురండి!" అని ఆజ్ఞాపించాడు.

వెంటనే సముద్రపు దొంగలు బిలబిలమంటూ అడవికేసి పరిగెత్తారు. సముద్రకేతుడి ఆజ్ఞలను శివదత్తుడు విన్నాడు. అతడు తన అనుచరులతో గుబురుగా పెరిగిన పొదల చాటున ఉండి యిదంతా గమనిస్తున్నాడు.

"శివదత్తా, ఇప్పుడు మనం ఏంచేయాలి? చూస్తూ ఊరుకుంటే, ఆ స్త్రీల నిద్దరినీ,





ఈ సముద్రపు దొంగలు తిరిగీ పట్టుకో గలరు!" అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు, నిస్సహాయంగా తల వూపి, "ఇప్పటి పరిస్థితుల్లో మనం చేయగలిగిం దేమీ లేదు. మనం ఎనిమిదిమందిమీ అసంఖ్యాకంగా ఉన్న, ఈ సముద్రపు దొంగలను ఎదిరించితే సర్వనాశం అయి పోతాం. ఈసరికి, ఆ స్త్రీలిద్దరూ, అడవి లోకి చాలా దూరం పారిపోయి, సురక్షితంగా దాక్కొగలరని ఆశిద్దాం!" అన్నాడు.

ఓ అరగంట గడిచేసరికి, అడవి ప్రాంత మంతా మార్మోగేలా, దొంగల కేకలు విని పించినై. కొద్దిసేపటికల్లా వాళ్ళు సముద్ర కేతుణ్ణి సమీపిస్తూ, "అయ్యా, ఆ ముసలిది కనబడలేదు. దీన్ని మాత్రం పట్టుకో గలిగాం!" అంటూ అతి సౌందర్యవతి అయిన కన్య నొకదానిని, తమ నాయకుడి దగ్గరకు పట్టుకు వచ్చారు.

"అహ్హహ్హ!" అంటూ సముద్రకేతుడు నవ్వి, "మనకు డబ్బు తెచ్చిపెట్టేది ఇదే! ఆ ముసలిది తిండి దండగ తప్ప మరెం దుకూ కొరగాదు. ఇక పడవలెక్కండి!" అంటూ వెనుదిరిగి, "అన్నట్టు, ఇక్కడ చేరిన ఆ కొత్తవాళ్ళెవరో గుర్తుపట్టారుగదా? ఈ ప్రదేశంతూడా మరిచిపోకండి. వీలయి నప్పుడు వచ్చి వాళ్ళందర్నీ వేటాడాలి!" అన్నాడు రోషంగా.

సముద్రకేతుడి నాలుగు పడవలూ తీరం నుంచి లోపలకు బయలుదేరినై. శివ దత్తుడు ఆ పడవలకేసి క్షణకాలం చూచి, "ఇక, ప్రస్తుతానికి మనం చేసేదేమీ లేదు. భోజనాలు ముగిద్దాం. పదండి!" అనేంతలో, అల్లంత దూరంనుంచి ఎవరో స్త్రీ రోదిస్తున్న ధ్వని వినబడింది.

శివదత్తుడు ఆశ్చర్యపోతూ, మందర దేవుడికేసి చూసి, ఆ రోదనధ్వని వచ్చిన వైపుకు బయలుదేరాడు. అనుచరు లందరూ, అతణ్ణి అనుసరించి నడిచారు.





శివదత్తుడు, తన అనుచరులతో కొద్ది సేపటికల్లా ఆ స్త్రీ ఉన్న చోటుకు వెళ్లాడు. ఆమె మరెవరో కాదు; సముద్రకేతుడి బారినుంచి పారిపో ప్రయత్నించిన ఇద్దరు స్త్రీలలో ఒకతె! శివదత్తుడు ఆమెను సమీపించి, "అమ్మా మీరెవరు? మీ పేరేమిటి? మీది ఏదేశం?" అని ప్రశ్నించాడు.

ఆ స్త్రీ, శివదత్తుడి ప్రశ్నలు వింటూనే, ఉలిక్కిపడి తల ఎత్తి అతడికేసి చూసి, భయభ్రాంతు రాలైంది. అది గమనించిన శివదత్తుడు, "అమ్మా, మానుంచి మీకు ఎలాంటి కీడూ రాదు. మీరు మరొక యువతితో, సముద్రకేతుడి బారినుంచి పారి పోవటం మేము చూచాం. నా అనుచరులు ఎనిమిదిమందికన్న ఎక్కువ లేరు. ఈ కొద్దిమందితో దాదాపు యాభై అరవైమంది సముద్రపు దొంగలను ఎదిరించటం ప్రమాద కరమని ఊరుకున్నాను!" అన్నాడు.

"అయ్యో, స్వయంప్రభను, ఆ క్రూరులు తిరిగీ పట్టుకుపోయారు!" అంటూ ఆ స్త్రీ బిగ్గరగా విలపించ సాగింది.

శివదత్తుడు, ఆమె దుఃఖాన్ని వారించేందుకూ, తను సహాయపడగలనన్న ధైర్యం ఆమెకు కలిగించేందుకూ, తన కథ యావత్తూ ఆమెకు క్లుప్తంగా చెప్పాడు.



అంతా విన్న ఆ స్త్రీ ఏడ్పు మాని, "అయ్యా, నా పేరు దేవమాయి. మాది శమనద్వీపం. పది పన్నెండేళ్లక్రితం నన్ను ఈ సముద్ర కేతుడు బందీగా పట్టుకున్నాడు. అప్పటి నుంచీ వాడిదగ్గిర బానిసగా బ్రతుకు తున్నాను. ఇప్పుడు వాడు బంధించుకు పోయిన కన్య పేరు, స్వయంప్రభ! ఆమెను నాలుగు రోజులక్రితమే ఆ క్రూరుడు శమన ద్వీప తీరంలో జలవిహారం చేస్తూండగా పట్టుకున్నాడు," అని చెప్పింది.

"అయితే, మీరు పదేళ్లనుంచి ఆ సముద్రకేతుడి దగ్గిర బందీగా ఉంటున్నా రన్న మాట? అలా అయితే, ఆ క్రూరుణ్ణి

గురించి సర్వం మీకు తెలిసివుంటుందని భావిస్తాను!" అన్నాడు శివదత్తుడు.

అందుకు దేవమాయి తల వూపి, "అయ్యా, వాణ్ణిగురించి సర్వం నాకు తెలుసు! ఈ ద్వీపం పడమటి తీరంలో 'మకరమండలం' అని పిలవబడే ఒకానొక కొండ ప్రదేశం ఉంది. ఆ ప్రాంతానికి వెళ్ళేందుకు ఒకే ఒక మార్గం ఉంది. అదంతా చిన్న చిన్న ఉప్పుటేరుల మయం. ఆ ఉప్పుటేరుల్లో ఉన్న ఒక మిట్టప్రదేశం అతడి నివాస స్థానం!" అన్నది దేవమాయి.

"అయితే, స్వయంప్రభను ఆ క్రూరుడు అక్కడికే పట్టుకుపోయి ఉంటాడు. ఆ మకర మండలంలో నివసించే మనుష్యులు నాగరిక జాతులా? లేక అడవి మనుష్యులా?" అని అడిగాడు శివదత్తుడు.

"ఆ మకరమండల వాసులు కేవలం అనాగరికులు మాత్రం కాదు. వారు పల్లెల్లో నివసిస్తూ ఉంటారు. వేటాడటమే వాళ్లకు ప్రధానమైన వృత్తి. వారికి ఒక రాజు కూడా ఉన్నాడు. కాని, నాలుగైదేళ్లుగా ఆ ప్రాంతమంతా అల్లకల్లోలంగా ఉంది. దానికి కారణం మకరమండల ప్రాంతాల్లో గల ఒకానొక కొండ చరియలో నివాసం ఏర్పరచుకున్న పెద్ద మొసలి!" అన్నది దేవమాయి.





"ఒక్క మొసలి కారణంగా...అది ఎంత పెద్దదయినా—దాన్నుంచి మొత్తం మకరమండల వాసులు భయపడుతున్నారా? ఆశ్చర్యంగా వుంది!" అన్నాడు శివదత్తుడు.

"అయ్యా, అది మామూలు మొసలి కాదు!" అన్నది దేవమాయి, వికృతాకారుడైన వజ్రముష్టికేసి భయంగా చూస్తూ. "ఆ మొసలికి పైశాచిక శక్తులున్నవనే వాదు ఉన్నది. దానిని వాళ్ళు, 'మకరదేవత' అని పిలుస్తారు. దానికి ఆహారంగా ప్రతి దినం నలుగు రైదుగురు మనుష్యులను వేస్తూంటారు. ఆ పని మకరమండల రాజైన హరిశిఖుడు స్వయంగా చేస్తూంటాడు. అందుకొకావలసిన మనుష్యులను ఈ సముద్రకేతుడు, హరిశిఖుడికి అమ్ముతూంటాడు!"

"అదా రహస్యం!" అంటూ శివదత్తుడు, మందరదేవుడికేసి చూశాడు.

"ఆ మొసలిని నేను సంహరించగలను. మీరు అనుమతించితే, ఆ మకరమండలానికి నేను బయలుదేరతాను!" అన్నాడు వజ్రముష్టి, శివదత్తుడికేసి చూస్తూ.

వజ్రముష్టి ఇలా అనేసరికి, దేవమాయి ముఖంమీద సంతోష చిహ్నాలు పొడచూపినై. ఆమె వజ్రముష్టికేసి అప్యాయంగా




చూస్తూ, "రెండు సంవత్సరాల క్రిందట, మకరమండల వాసి ఒకడు గణంపూని భవిష్యత్తులో జరగబోయేదాన్ని గూర్చి చెప్పాడు. మూడు నాలుగడుగులు ఎత్తుగల వికృతాకారు డొకడు, మకరమండలానికి త్వరలో వస్తాడనీ, అతడి చేతిలో ఆ మొసలికి చావు రాసిపెట్టి ఉన్నదనీ, ఆ తరవాత మకరమండలం, ఏ అరిష్టాలూ లేకుండా, సర్వసంపదలతో తులతూగగలదనీ అతడు అన్నాడు!" అని చెప్పింది.

దేవమాయి మాటలకు శివదత్తుడు నవ్వాడు. తరవాత వజ్రముష్టికేసి తిరిగి, "బహుశా, ఆ వికృతాకారుడు వజ్రముష్టే



కావొచ్చు! నువ్వు ఆ మకరమండలానికి దారి చూపితే, మనం అక్కడికి బయలుదేరదాం!" అన్నాడు.

"దారిలో, సముద్రకేతుడి నివాసస్థానం ఉంది! దానిని తప్పుకు పోవటం సాధ్యమయే పని కాదు!" అన్నది దేవమాయి భయంతో వణికిపోతూ.

"ఆ సాధ్యాసాధ్యాలు మేము చూచుకుంటాం. స్వయంప్రభకూడా ప్రస్తుతం, ఆ క్రూరుడి అధీనంలో ఉండివుంటుంది!" అన్నాడు మందరదేవుడు కోపంగా.

"అవును, ఆమెనుకూడా ఆ సముద్రకేతుడు మకరదేవతకు ఆహారంగా అమ్మ చూస్తున్నాడు. ఆ సంగతి నాకు తెలుసు. అందమైన యువతులకూ, బలిష్ఠులైన యువకులకూ హరిశిఖుడు ఎక్కువ ధనం ఇస్తూంటాడు. అందుకే సముద్రకేతుడు అలాంటి వాళ్లకై సముద్రతీరాలు వెతుకుతూంటాడు!" అన్నది దేవమాయి.

శివదత్తుడు ఆమె మాటలు విని కొంచెంసేపు ఆలోచించి, "దేవమాయీ, ఏవిధంగానైనాసరే, మేము స్వయంప్రభను రక్షిస్తాం. ఆ క్రూర సముద్రకేతుణ్ణికూడా సర్వనాశనం చేసితీరుతాం! హరిశిఖుడి సంగతి తరవాత ఆలోచించవచ్చు" అన్నాడు.





శివదత్తుడి మాటలకు మందరదేవుడు అవునన్నట్లు తల ఊపాడు. తరవాత శివదత్తుడు తన అనుచరులకేసి తిరిగి, "ముందు భోజనాలు ముగించుకుందాం. తరవాత జాగుచేయక ఆ మకరమండలానికి బయలుదేరుదాం!" అన్నాడు.

అనుచరులందరూ అంగీకార సూచకంగా తలలూపారు. దేవమాయితో సహా అందరూ లోగడ వదిలిపెట్టిన భోజనాల దగ్గరకు వచ్చి, త్వరత్వరగా భోజనాలు ముగించారు. అప్పటికి సూర్యుడు నెత్తిమీదికి వచ్చాడు. ఎండ తీక్షణంగా వుంది. కొంచెంసేపు విశ్రాంతి తరవాత, "ఇక బయలుదేరదాం. ప్రొద్దుకుంకే లోపల, ఆ సముద్రకేతుడి నివాసస్థానం ఎక్కడో తెలుసుకోవటం అన్నివిధాలా మంచిది!" అన్నాడు శివదత్తుడు.

కొద్దిసేపట్లో అందరూ ప్రయాణానికి సిద్ధమయారు. ద్వీపానికి పడమటి ప్రాంతాన గల సముద్రకేతుడి నివాసస్థానం తెలిసినది ఒక్క దేవమాయికే అవటంవల్ల, ఆమెకు మార్గం చూపే బాధ్యత ఒప్పచెప్పబడింది. శివదత్తుడూ, మందరదేవుడూ ఆమెకు ముందు వెనకల నడవసాగారు. అనుచరులు వాళ్లవెనక బయలుదేరారు.




వాళ్ళు నడుస్తున్న మార్గంలో ఎక్కడా జనసంచారం ఉన్న గుర్తులే లేవు. ఎక్కడా కాలిబాటలుగాని, నివాసస్థానాలుగాని వారికి కనిపించలేదు. చిత్రవిత్తుగా పెరిగిన మహా వృక్షాలతో, వాటి మొదళ్లకు అంటిపెట్టుకు పెరుగుతున్న అనేక రకాల అడవిచెట్లతో—ఆ ప్రాంతమంతా మిట్టమధ్యాహ్నంవేళ కూడా చీకటిమయంగా ఉంది. ఆ ప్రాంతాల, వారికి చెట్లనుంచి వేలాడుతున్న పెద్ద పెద్ద కొండచిలువలు కనిపించినై.

అజాగ్రతవల్ల వాటి బారి పడకుండా, శివదత్తుడూ, అతని అనుచరులూ ఎంతో మెలకువతో ముందుకు నడవసాగారు.



సరిగా సూర్యాస్తమయం కాబోయేవేళ వజ్రముష్టి అందరికన్న ముందు నడిచి, దారిపక్కన ఉన్న ఒక పెద్ద చెట్టు ఎక్కాడు. అతడికి దాదాపు ఒక మైలు దూరంలో అల్లిబిల్లిగా ఉన్న సముద్రపు ఉప్పుటేర్లూ, అందులో చిన్న చిన్న భూభాగాలూ కనిపించినై. అలాంటి ఒక ప్రదేశంలో కొందరు మనుష్యులు కూడా ఉండటం వ్రజముష్టి గుర్తించాడు.

వజ్రముష్టి వెంటనే చెట్టు దిగి, శివదత్తుణ్ణి సమీపించి, "అయ్యా, మనం దేవమాయి చెప్పే సముద్రకేతుడి నివాసస్థానానికి ఎంతో దూరంలో లేమనుకుంటాను. ఆ చెట్టుమీంచి చూస్తే, పాముల్లా మెలికలు తిరిగివున్న ఉప్పుటేర్లూ, అక్కడక్కడా భూప్రదేశం కనబడుతున్నది. ఒకచోట కొందరు మనుష్యులుకూడా కనిపించారు. వాళ్లు సముద్రపు దొంగల ముఠా కావొచ్చు!" అన్నాడు.

"అలా అయితే, మనం అందరం ఒకేసారి ఆ ప్రాంతాన్ని సమీపించటం మంచిది కాదు. నువ్వు మరిద్దర్ని వెంటబెట్టుకుని ముందు వెళ్లి, అక్కడి స్థితిగతు లేమిటో తెలుసుకు రా!" అన్నాడు శివదత్తుడు.

శివదత్తుడి ఆజ్ఞ కాగానే వజ్రముష్టి ఇరువురు అనుచరుల్ని వెంటతీసుకుని, బయలుదేరాడు. వాళ్లు చెట్లచాటున ఎంతో జాగ్రత్తగా నడుస్తూ, కొద్దిసేపటికి ఉప్పుటేర్లు ఉన్న ప్రాంతం చేరారు. ఉప్పుటేరు ఒడ్డున గుబురుగా పెరిగిన చెట్ల చాటునుంచి, ముందుకు చూచినప్పుడు వారికి ఉప్పుటేరులో చిన్న చిన్న తెప్పలు కొన్ని కనిపించినై. ఆ ఉప్పుటేరు వెడల్పు, నలభై యాభై గజాలకంటె ఎక్కువ ఉండదు. దాని అవతల అంచున ఉన్న ఎత్తయిన ప్రదేశంనుంచి వికృతమైన నవ్వులూ, కేకలూ వినిపించు తున్నయ్.

(ఇంకా వుంది)



# నావికుడు సింద్‌బాద్

లోయ ఎలా ఉన్నదీ చూద్దామని నడవసాగాను. అక్కడి శిలలు మామూలు శిలలుకావు. అందులో మణులున్నాయి! కిందఅంతటా రాళ్ళనుంచి ఊడి పడిన మాణిక్యాల కుప్పలున్నాయి. కొన్నిచోట్ల ఇవి మనిషి తల యెత్తుకూడా ఉన్నాయి. నేనీ రత్నాలను చూసి ఆనందించే వ్యవధి అయినా లేకుండా ఒక భీకరదృశ్యం నా కళ్ళ పడింది. ఈ రత్నరాసుల మధ్యగా తాటిబొందలంతేసి లావుగల నల్లని, భయంకరమైన పాములు తిరుగుతున్నాయి. అవి ఏనుగులను సయితం సునాయాసంగా మింగగలవని పించింది. బాగా తెల్లవారితే గండభేరుండపక్షులు తమను చూస్తాయని, ఆ పాములు తమ రహస్య స్థానాలకు వెళ్లి పోతున్నాయి. రాత్రిపూట మాత్రమే అవి ఈ లోయలలో స్వేచ్ఛగా తిరగగలవు.

పాములు ఎక్కువగా వున్న చోట్లకు దూరంగా వుంటూ పొద్దుగుంకేదాకా నేనా లోయ అంతటా తిరిగాను. నాకు ఆకలి దప్పుల సంగతికూడా జ్ఞాపకం రాలేదు; ఈ పాముల వాత పడకుండా చూసుకోవటం తప్ప నాకు మరే ఆలోచనా లేదు.

రెండవ సముద్రయానం

CHITRA




వెతకగా వెతకగా నా కొక కొండబిలం కనిపించింది. అది నేను దూరేపాటిది. ఆ రాత్రికి అందులో దూరి భద్రంగా వుండ వచ్చు ననుకుని, ద్వారానికి ఒక పెద్దరాయి అడ్డుపెట్టి లోపలికి పాకుతూ వెళ్ళాను. నేను కొద్దిదూరం వెళ్లేసరికే ఒక భయంకర మైన విషయం తెలియవచ్చింది. అదేమి టంటే నేను దూరినది కొండబిలం కానే కాదు—ఒక నల్లపాము చుట్ట! ఆ పాము తన గుడ్లను పొదుగుకోవటానికి అది చుట్ట చుట్టుకు పడుకుంది. ఆ సంగతి గ్రహించ గానే నాకు భరించరాని భయం కలిగి స్పృహ తప్పిపోయింది.

నేనా స్పృహలోనుంచి బయటపడి, రాయి తోసుకుని బయటికి వచ్చేసరికి తెల్ల వారిపోయింది. నా కాళ్లు గుడ్డపీలికల్లాగా ఉండటంచేత నేను సరిగా నిలబడలేకుండా ఉన్నాను. ఆకలి దప్పులవల్లా, విశ్రాంతి లేకా నేను నీరసించి పోయాను. ఇంకా నయం ప్రాణాలతో బయటబడ్డాను. నన్నా పాము మింగేసిందికాదు. నేను లోయలో నిలబడి చుట్టూ కలయచూస్తున్నంతలో తపుక్కుమని మాంసంముక్క ఒకటి నా సమీపంలోనే రాళ్లమీద పడింది.

నేను ఉలికిపడి, అది ఎక్కడినుంచి వచ్చిందో అని తల ఎత్తి చూశాను. కాని ఆ మాంసంముక్క పడవేసినవారు ఎక్కడా కనిపించలేదు.

ఇంతలో నాకు చిన్ననాడు విన్న విషయం ఒకటి జ్ఞప్తికి వచ్చింది; రత్నాలుండే పర్వ తాలలో తిరిగి వచ్చినవారు నాకా విషయం చెప్పారు. రత్నాల లోయనుంచి రత్నా లను సంగ్రహించేవారు, గొర్రెలను కోసి ముక్కలు నరికి వాటిని కొండలమీదినుండి లోయలోకి విసిరివేస్తారు. అవి అదృష్ట వశాత్తూ మణులమీద పడినప్పుడా మణులు మాంసంలో గుచ్చుకుంటాయి. తరవాత గండభేరుండ పక్షులు ఆ ముక్క

లను తన్నుకుపోయి, కొండలమీద ఉండే తమ గూళ్లకు తీసుకుపోతాయి, అప్పుడు రత్నాలను అన్వేషించేవారు పెద్ద పెద్ద చప్పుళ్లు చేసి పక్షిని గూటివద్దనుంచి తరిమేసి మాంసంలో ఇరుక్కుపోయిన రత్నాలను ఏరుకు పోతారు.

ఈ విషయం జ్ఞాపకం రాగానే ఈ లోయలోనుంచి బయటపడే మార్గంకూడా నాకు తట్టింది. నేను వెంటనే పెద్ద పెద్ద రత్నాల కోసం వెతికి వాటిని నా జేబులలోనూ, అంగీలోనూ, ఎక్కడ వీలయితే అక్కడల్లా నించుకున్నాను. తరవాత నా తల పాగా ఊడదీసి, కింద పడిన మాంసం ముక్కను నా పొట్టకు కట్టేసుకున్నాను. తరవాత వెల్లికిలా పడుకున్నాను. కొద్ది సేపట్లో ఏదో పక్షి వచ్చి, మాంసంముక్కను తన గోళ్లతో పట్టుకుని, నన్ను లోయలో నుంచి అకాశమార్గాన ఎత్తుకుపోయి తన గూటివద్ద దింపింది. తరవాత అది నా పొట్టకు కట్టిన మాంసాన్నీ, నన్నూకూడా చీల్చి తన బిడ్డలను మేపసాగింది. అదృష్ట వశాత్తూ ఇంతలోనే భీకరమైన మోతలు వినపడ్డాయి. పక్షి ఎగిరి చక్కా పోయింది. నేను లేచి నిలబడ్డాను. నా ముఖమూ, దుస్తులూ రక్తంతో తడిసిపోయాయి.



ఇంతలోనే అక్కడి కొక వర్తకుడు పరిగెత్తుకుంటూ వచ్చి, నన్ను చూసి దిగ్భ్రమ చెందిపోయాడు. అయితే నేను కదలక పోవటమూ, అపకారం చేసేవాడిలాగా కనపడకపోవటమూ చూసి, అతను ధైర్యం తెచ్చుకుని, ముందుకు వచ్చి మాంసం ముక్కను పరీక్షించాడు. అందులో రత్నాలేమీ లేవు. అతను చేతులు పైకెత్తి, "ఓ అల్లా! మోసం! దగా!" అంటూ చప్పట్లు చరిచాడు.

నే నతన్ని మర్యాదగా పలకరించాను. అతను మాత్రం నాతో మర్యాదగా మాట్లాడటానికి మారుగా, "ఎవరు నువ్వు? నా సొత్తు

దొంగిలించటానికి ఇక్కడికి ఏం వచ్చావు?" అన్నాడు కోపంగా.

"భయపడకండి, షావుకారుగారూ. నేను దొంగను కాను. మీ సొత్తేమీ హరించనూ లేదు. నన్ను చూసి ఏ భూతమో, పిశాచమో అనుకోకండి; నేను మనిషినే, వర్తకుణ్ణే. నే నిక్కడ ఉండటమే ఒక విచిత్రమైన కథ. ఆ కథ మీకు చెబుతాను. కాని ముందుగా నేను మీకు స్నేహపూర్వకంగా కొన్ని రత్నాలిస్తాను, స్వీకరించండి. మనుష్యమాత్రు డెవడూ ఎన్నడూ అడుగు పెట్టని రత్నాల లోయలో నేను వీటిని ఏరాను," అన్నాను.

ఈ మాట అంటూ నేను ఏరిన రత్నాలలో చాలా పెద్దవి కొన్ని తీసి ఆ వర్తకుడి చేతిలో పెట్టాను. అవి తీసుకుని అతను పరమానందభరితుడై నన్ను భట్రాజు పొగిడినట్టు పొగిడి, "ఈ మణులలో ఒక్కటి చాలు, నా జన్మపొడుగునా భాగ్యవంతుడుగా జీవించగలను. నా జన్మలో ఇంత వెలగల రత్నాలు, ఎంత గొప్ప వర్తకుడివద్దా చూడలేదు. ఆఖరుకు రాజుల వద్దకూడా ఇంత విలవైనవి ఉండవు!" అన్నాడు ఆశ్చర్యంగా.

ఇంతలోనే మిగిలిన వర్తకులుకూడా వచ్చారు. వారందరికీ నా కథ చెప్పాను.



వాళ్ళు నా కథ విని చాలాసేపు ఆశ్చర్యపడి, తరవాత, "అల్లా అనుగ్రహంవల్ల మీరా లోయనుంచి బయటపడ్డారుగాని, మానవ మాత్రుడి కది సాధ్యమయే పని కాదు!" అని అభినందించారు. నేను శోషతో పడి పోయే స్థితిలో ఉండటం గమనించి, పాపం, వారు నన్ను తమ గుడారానికి చేర్చి కడుపు నిండా తిండి పెట్టారు, పానీయా లిచ్చారు. ఆ గుడారంలో నే నొక పగలూ, రాత్రీ హాయిగా నిద్రపోయాను.

మర్నాడు ఉదయం మేమంతా కలిసి బయలుదేరి కొండలు దిగి సముద్రతీరాన్ని చేరుకున్నాం. అక్కడినుంచి పడవలో బయలుదేరి కర్పూరద్వీపం వెళ్ళాం. అక్కడ బ్రహ్మాండమైన కర్పూర చెట్లున్నాయి. ఎంత ఎండలోనైనా వాటికింద చల్లగా ఉంటుంది. ఒక్కొక్క చెట్టునీడలో వందేసి మంది సుఖంగా విశ్రమించ వచ్చు. ఈ చెట్ల బోదెలకు గాట్లు పెడతారు. వాటి నుంచి కారే సొనను కుండల్లో పట్టి సువాసన గల హారతికర్పూరం తయారుచేస్తారు.

ఈ ద్వీపంలోనే నేనొక భయంకరమైన మృగాన్ని చూశాను. అది ఖడ్గమృగం జాతిదేగాని అంతకంటె చాలా పెద్దది, ఒంటెకన్న ఎత్తుంటుంది. దాని ముట్టెపై పదిమూరల ఎత్తు కొమ్ముంటుంది. అది



మామూలుగా ఆకులూ అలములూ మేస్తూ దున్నలాగా సంచరిస్తుంది. కాని దానితో తలపడితే ఏనుగుకూడా దాన్ని గెలవలేదు. అది ఏనుగును తన కొమ్ముతో పొడిచి అవలీలగా పైకి ఎత్తేస్తుంది. ఏనుగు చచ్చిపోతుంది, కాని ఏనుగు మదం కారి ఈ ఖడ్గమృగానికి కళ్ళు కనిపించవు. ఈ దశలో గండభేరుండపక్షి వచ్చి రెంటినీ తన్నుకుపోతుంది. ఈ ద్వీపంలో అనేక రకాల బర్రెలనుకూడా చూశాను.

ఈ ద్వీపంలో కొద్దిరోజులు ఆనందంగా గడిపాం. నేను తెచ్చిన మణులలో కొన్నిటిని విక్రయించి బంగారమూ, వెండీ కొన్నాను. వాటిని వెయ్యటానికి ఒక పడవ చాలిందికాదు. అక్కడినుంచి బయలుదేరి ఎన్నో దీవులు, ఎన్నో దేశాలు, యెన్నో నగరాలు చూసుకుంటూ, ప్రతిచోటా క్రయవిక్రయాలు జరుపుతూ చిట్టచివరకు బస్రా చేరి, అక్కడినుండి నదివెంబడి బగ్దాదు నగరం చేరుకున్నాను. అంతులేని బంగారమూ, వెలలేని రత్నాలూ వెంటబెట్టుకుని ఇంటికి వెళ్ళాను. బంధు మిత్రులందరూ నన్ను చూసి పరమానందం పొందారు. ఎరిగినవారిని ఒక్కరినికూడా బీదపోనివ్వకుండా అందరికీ బహుమతులు ఇచ్చాను.

ఆనాడు లగాయతు సుఖమైన భోజనాలు చేస్తూ, విలవైన పానీయాలు తాగుతూ, వెలగల వస్తువులు ధరిస్తూ, హంసతూలికా తల్పాలమీద శయనిస్తూ రాజవైభోగంగా జీవితం సాగించాను. నా చుట్టూ ఆప్తమిత్రులు అస్తమానం ఉండేవారు.

రోజూ ఎందరెందరో గొప్పవాళ్లు నన్ను చూడవచ్చి దూరదేశాల వార్తలు వినేవారు. వారికి కావలిసిన విషయాలన్నీ చెప్పేవాణ్ణి. నా అనుభవాలు విన్నవారందరూ, ప్రాణాలతో బయటపడినందుకు నన్ను అభినందించేవారు. నా రెండవ సముద్రయానం ఈ విధంగా ముగిసింది.





# గంగులు భక్తి

ఒక పల్లెటూళ్ళో గంగులు అని ఒక గారడీ వాడుండేవాడు. వాడు ఏటా కొన్నాళ్లపాటు గ్రామగ్రామానికీ వెళ్లి, రచ్చపట్టు చేరి, గొంతెత్తి చమత్కారమైన మాటలు మాట్లాడేవాడు. వెంటనే గ్రామంలో గల కుర్రవాళ్ళూ, యువకులూ వాడి చుట్టూ గుంపుగా మూగేవారు.

గంగులు తన గురువువద్ద నేర్చిన విద్య లన్నీ, ఒక్కటికూడా బీరుపోకుండా, ప్రతి చోటా ప్రదర్శించేవాడు. రకరకాల మొగ్గలు వేసి బంతులాడించేవాడు, కత్తులాడించే వాడు. చివరకు ప్రేక్షకు లిచ్చినది పుచ్చు కుని మరొక చోటికి వెళ్ళిపోయేవాడు.

గారడీ విద్యలో గంగులును మించిన వాడు లేడని అందరూ ఒప్పుకునేవారు. కాని వాడి సంపాదన రెండు పూటలా తిండికే చాలేదికాదు. వాడు అతి బీద స్థితిలో ఉండేవాడు.

"ఈ జీవితం ఇలా వెళ్ళితే ఈ ఇహ లోకంలో సుఖపడలేదని విచారించను, చచ్చినాక ఆ లోకంలోనైనా దేవి అను గ్రహంవల్ల సుఖం దొరికితే అదే చాలు!" అనుకునేవాడు గంగులు.

గంగులు పుట్టి పెరిగిన గ్రామంలో ఒక దేవీ ఆలయం ఉంది. ఆ దేవి చాలా మహిమ గలదని ఆ చుట్టుపక్కల అనేక గ్రామాలవాళ్ళకు నమ్మకం. నవరాత్రులు జరిగితే అనేక గ్రామాలవాళ్ళు ఈ ఆల యానికి వచ్చి ఎంతో వైభవంగా ఉత్సవాలు చేసి, ఎంతో డబ్బు ఖర్చుచేసేవారు. పొట్ట చేత పట్టుకుని ఎన్ని గ్రామాలు తిరిగినా, గంగులు నవరాత్రులకు విధిగా స్వగ్రామం తప్పక చేరుకునేవాడు.

రానురాను గంగులు పెద్దవాడైపోయి నాడు. గారడీ చెయ్యటంలో వాడి శక్తి ఏమీ తగ్గకపోయినా, వాడి రాబడి మాత్రం

కె. రాజేశ్వరరావు

తగ్గింది. ఎందుచేతనంటే, చుట్టుపక్కల అన్ని గ్రామాలవాళ్ళూ గంగులు గారడీని ఎన్నో వందలసార్లు చూసి ఉన్నారు. వారికి అందులో కొత్తదనం పోయింది. అసలే పేదవాడైన గంగులు వయసు మళ్లినకొద్దీ మరింత పేదవాడు కాసాగాడు.

ఇహసుఖం తగ్గిపోతున్నకొద్దీ గంగులుకు పరలోక సుఖంమీద కోరికా, నమ్మకమూ హెచ్చసాగాయి. వాడు ఊళ్ళవెంట తిరగటం తగ్గించి, ఎక్కువ కాలం దేవీ ఆలయంలోనే గడుపుతున్నాడు.

ఒకసారి నవరాత్రులు వచ్చాయి. ఊళ్లో అందరూ నవరాత్రి ఉత్సవాల పనిలోనే నిమగ్నులై ఉన్నట్టు కనపడ్డారు. సమారాధనకు కూరలూ, ధాన్యమూ బళ్లతో వచ్చి పడుతున్నాయి. గుడి చుట్టూ పందిళ్లు వేస్తున్నారు, తోరణాలు కడుతున్నారు.

వీరందరినీ చూసి గంగులు తన్మయుడైపోయాడు. "పుణ్యాత్ములు! ఆ తల్లి వీళ్ళందరిని చల్లని చూపు చూడక ఏం చేస్తుంది? ఇక బ్రాహ్మల పుణ్యం చెప్పనే అక్కర్లేదు. వాళ్ళు మంత్రాలు చదువుతారు, పూజలు చేయిస్తారు, అంతు లేని పుణ్యం సంపాదిస్తారు," అనుకున్నాడు వాడు.

అంతలోనే వాడికి పెద్ద విచారం పట్టుకుంది. "ఈ ఉత్సవంలో కుండలు చేసే



వాళ్ళూ, భజంత్రీలూ, హరిదాసులూ, భజనలు చేసేవాళ్ళూ, ఆఖరుకు సంతర్పణ వంటలు చేసేవాళ్లుకూడా అమ్మవారికి తమ శక్తికొద్దీ సేవచేసి పుణ్యం సంపాదించుకుంటారు. కాని నావల్ల ఏమీ కాదు. నేను ఆ తల్లికి ఏమీ చెయ్యలేను!" అనుకుని గంగులు నిట్టూర్చాడు.

దేవీ నవరాత్రులు ఆరంభమయాయి. తొమ్మిది రోజులూ ఆలయం భూలోక వైకుంఠంగా ఉంది. ఇదంతా కళ్లే చూసిన ఆనందంతోబాటు గంగులుకు తీరని ఆవేదన కూడా పట్టుకుంది. "ఇంతమంది ఇన్ని విధాల దేవికి సేవచేశారు! నేనేం చేశాను?" అని వాడు విచారించసాగాడు. తొమ్మిదో రోజున వాడికొక మంచి ఆలోచన వచ్చింది. దానితో వాడి విచారమంతా పోయింది.

ఆ రాత్రి పూజ అయిపోయాక అందరూ వెళ్ళిపోయారు. ప్రసాదం ఇంకా ఏమైనా దిగబడిపోయిందేమో చూడటానికి పూజారి గుడిలోకి అడుగు పెట్టేసరికి ఒక వింత దృశ్యం కనిపించింది. కుంకంతో, పూలతో సగం కూరుకుపోయిన దేవివిగ్రహం ముందు గంగులు మొగ్గలు వేసి బంతులూ, కత్తులూ ఆడిస్తున్నాడు!

పూజారి అప్పటికప్పుడే పరిగెత్తి, ధర్మకర్త ఇంటికి పోయి, ధర్మకర్తను లేపి,



"బాబూ, గంగులు చూడండి, గుళ్లో ఏం చేస్తున్నాడో!" అన్నాడు.

"ఏం చేస్తున్నాడు?" అని ధర్మకర్త అదుర్దాగా అడిగాడు.

"గుళ్ళో విగ్రహం ఎదట గారడీ చేస్తున్నాడు. వాడికి నిజంగానే మతి పోయింది!" అన్నాడు పూజారి.

"నువు వెళ్లి శాస్త్రుల్లుగారినీ, అవధాన్లు గారినీ పిలుచుకు రా!" అని పూజారిని పంపేసి, ధర్మకర్త నేరుగా గుడికి వెళ్లాడు. ఆయన చప్పుడు చేయకుండా గుడివాకిలి వద్దకు పోయి ఓరగా తెరిచిన తలుపు సందుల్లోనుంచి చూశాడు. ఆయన శరీరం ఒక్కసారి జలదరించింది.

గుడి లోపల గంగులు నిద్రపోతున్న వాడిలాగా పడుకుని ఉన్నాడు. దేవి వాడి తలను తన ఒడిలో పెట్టుకుని, ఒక చేత్తో విసనకర్ర తీసుకుని విసురుతూ, రెండవ చేత తన చీరెకొంగు పట్టుకుని గంగులు నుదిటిమీది చెమట తుడుస్తున్నది! విగ్రహం ఉండవలిసిన చోట విగ్రహం లేదు!

వెంటనే ధర్మకర్త వాకిలిదగ్గిర సాష్టాంగంపడి దేవీస్తవం చదవసాగాడు. ఇంతలోనే మరికొందరు బ్రాహ్మలను వెంట పెట్టుకుని పూజారి గుడికి వచ్చాడు. ఆయన ధర్మకర్తను చూసి, "ఏమిటి, బాబూ? ఏమిటిది?" అని అడిగాడు.

ధర్మకర్త లేచాడు. అందరూ గుడిలోకి అడుగుపెట్టారు. విగ్రహం యథాస్థానంలో ఉంది. గంగులు నిశ్చింతగా నిద్ర పోతున్నాడు. ధర్మకర్త తాను చూసిన దృశ్యం మిగిలినవాళ్లకి వర్ణించి చెప్పాడు.

బ్రాహ్మలు నమ్మలేదు. కాని కుంకంలో దేవి పాదంగుర్తు స్పష్టంగా కనబడింది. విగ్రహానికి కట్టిన చీరెచెంగు చెమటతో తడిసిఉన్నది. "మనమంతా దొంగ భక్తులం! ఈ గంగు లొక్కడే దేవికి ముద్దుబిడ్డ!" అన్నాడు ధర్మకర్త.





# మిత్రభేదం

దమనకు డంత శీ-ఘ్రముగ సంజీవ
కము దిరుగాడు తీ-రము చెంతకేగె.
ఎలుగెత్తి ఇట్లని - ఎద్దును బిలిచె;
"పలుగాకి ఓ గిత్త! - ప్రభు వాజ్ఞయయ్యె
పలుఱంకె లేల నీ - పనిపట్టు నిపుడు,
కొలువుకూటమునకు - గొబ్బున రమ్ము."

సంజీవకుడు:

ఎవరయ్య? ఆ ప్రభు - వెవ్వరే నెఱుగ!
నవుటాలకా! పిల్వ-నంపుట యేల?

దమనకుడు:

కానకెల్లను రాజు-గద! పింగళకుడు!
వానినే ఎఱుగవా? - వారెవా! తెలివి!
మృగరాజు మఱ్ఱిక్రిం-దుగ కొల్వుదీఱ
మెగములెల్లను చేఱ - మెడవంచి రమ్ము.
తెలిసివచ్చును మృగ-మ్ముల రాజెవండొ?
పలుకక రమ్మురా - పారిపోలేవు...
ఈ మాట విన్నంత - ఎద్దు కంపించె
సామాన్యమే సింహ-మే మఱి పిలిచె!
పైన ప్రాణమ్ములు - పైననే పోవ
గా, నయమ్ముగ ననె-గద! గిత్త తెగువ.

సంజీవకుడు:

మంచివాడవుగ గ-న్పించుచున్నావు
మించిపోయినదేమి - కొంచెము నిలువు.
మాటకారివి నీవు - మనవి చేసెదను
చేటు రాదని చేత - చేయిని వేయి.
కీడెంచి మేలెంచ - పాడియౌగాదె
ఆడకు వచ్చిన - నాత డేమనునొ?
'నీకేమి భయము రా-నీడు రాజ'నుచు
నాకు చెప్పినగాని - నడచి రాలేను.

దమనకుడు:

ఔనౌను సత్యమే - అగును నీ మాట!
ఏ నాడు రాజుల - ఎద నేమికలదొ
సారమ్ము గుర్తించి - చలియించవలయు
పోరాదు వారల - పొంత కూఱకయె.
ధీరత చరచర - మూరు పల్కకయె
ధారుణి అంతమ్ము .. దఱియగవచ్చు;

విద్వాన్ విశ్వం



పోవచ్చు సంద్రమ్ము - పొరలు తావులకు,
పోవచ్చు కొండల - త్రోవలకైన
రాజుల దఱికి మా-త్రము, ముందు వెనుక
యోజించియే పోవు - టొప్పునుసుమ్ము.
కొంచె ముందుము గమ-నించి వచ్చెదను
మంచిగా నా రాజు - మనసులో మాట
సమయముజూచి నే - చయ్యన వత్తు
సుమి! అప్పుడే పోవు-దము సభాస్థలికి.
అని దమనకుడు సిం-హము దఱి కేగి,
విను రాజ విన్నప-మ్మని చెప్పదొడగె.

దమనకుడు :

సామాన్య జంతువా! - స్వామి, ఏమందు?
ఆ మహేశ్వరుని వా-హనమె ఆ గిత్త!
శివుడు సంతోషించి - చెచ్చెఱ యమున
ఇవతల విహరింప - నీ కొనెనంట.
ఈ యరణ్యమ్మతని-కే యిచ్చినాడు
ఆయన నేమని - అందుమో చూడు!

పింగళకుడు :

అదిగదీ! ఇప్పు డం-తా తేటపడియె
పెదదేవు నాజ్ఞపై - అది వచ్చెగాక!
పుడమిపై గడ్డి మే-సెడి గిత్త యొకటి
అడుగిడ గలదె! కీ-కారణ్యమందు!
అంకె వేయుచు భీతి - రవ్వంత లేక,
సంకోచమును వీడి - చరియించ గలదె!
అయిన నీవేమని - అడి వచ్చితివి
నయవాది వౌదువు - నాతోడ చెప్పు.

దమనకుడు :

ఆ గిత్తతో నిట్టు - లంటిని దేవ!
'ఈ గహనాటవి - కీశ్వరుండైన
పింగళకుం డను - పెద్ద సింహమ్ము
ముంగల దుర్గకు - ముద్దు వాహనము
ఈ యరణ్యమునకీ - వేతెంచినావు
ఆయన యింట నీ - వతిథివి నేడు.
మా దొర కొలువుకు - మక్కువ రమ్ము
మా దొరతో గూడి - మఱి యుండి పొమ్ము.
అన్నదమ్ముల వోలె - అహార పాన
సన్నాహముల రాజు - సావాసి వగుము.'
అని చెప్పగా నత - డంగీకరించె

వనరాజు నభయమ్ము - వాంఛింతు ననెను.

పింగళకుడు :

బలెబలే బహు మంచి - పని చేసినావు
తెలివైన వాడవు - పలు మాటలేల!
అయన కిదె నేను - అభయ మిచ్చితిని
పోయి తోడ్కొని రమ్ము - ప్రొద్దు వోగలదు.
అతనితో నా కభ-యమ్మనిపించు
కత గూడ నీ పైని - గలదోయి మంత్రి.
వంకర టింకర - వడుపులు లేక
పొంకమ్ముగా చేవ - పూర్తి గానున్న
కంబమ్ము లింటిని - కాపాడు నట్లు
నింబోలు మంత్రుల - నిలుచు రాజ్యమ్ము.
పరుల మిత్రుల జేయు - పట్టున, మంత్రి
వరు బుద్ధిబలము వె-ల్వడుచుండు నెపుడు.
నన్ను ముంచుకవచ్చు - సమయమ్ము నందె
మిన్నయౌ వైద్యుని - మెలకువ దెలియు...
దమనకు డాపయి - దండము వెట్టి
సమయమ్ము సనె రాజు - సంతోషపెట్టి
తన మాట జవదాట-కనె ఉండునట్లు
అనువుగా చరియింతు-నని బయల్దేరె.
సంజీవకుని జేరి - సవినయమ్ముగను
రంజించు మాటల - రక్తి నిట్లనియె :

దమనకుడు :

నేస్తుడా నీకయి - నే దొరం జూచి
ప్రస్తుతి సేసి 'అ-భయము' దెచ్చితిని.



కాని, నే, నొక మాట - కలదు చెప్పెదను
అనక దొర జేరి - అన్న! నన్ విడకు.
నీ మాట పైననే - నేను ప్రధాని
గా మన పాలన - కావింతు లెమ్ము.
మన మిద్దఱము స్నేహ-మున రాజ్యసుఖము
చనవుతో మెలగుచు - అనుభవించుదము.
దొరయె నావాడయ్యె - సరిపోయె ననుచు
మతి నన్ను విడిచిన - మంచిది కాదు.
దొర తనవాడని - పెఱవారి విడిచి
పరగ దంతిలుడు స-ర్వము గోలుపోడె.

సంజీవకుడు :

ఆ దంతిలుం డెవ్వ - డా కథ యేమి ?
సాదరమ్మున జెప్పు-మీ దయచేసి!




# పౌత్రప్రేమ

పూర్వం శ్రావస్తీనగరంలో సుపుత్రకుడని ఒక బుద్ధిమంతుడైన యువకుడుండేవాడు. తన తండ్రి పోయాక అతను తన తల్లిని ఎంతో భక్తిశ్రద్ధలతో సేవించుతూ, ఆమెను సుఖపెడుతూ వచ్చాడు. అతని కాలమంతా తల్లిసేవలోనే గడిచిపోతూండటంవల్ల అతను ఏ ఉద్యోగమూ చేయలేదు. ఇది చూసి తల్లి, "నాయనా, ఇంటికైన మగవాడవు. నాకు అహోరాత్రాలు సేవ చేస్తూంటే ఎట్లా జరుగుతుంది? పెళ్ళి చేసుకో, నా ఉపచారాలు నీ భార్యే చేస్తుంది. నువ్వేదైనా పనిచూసుకోవచ్చు," అన్నది.

తల్లిమాట కాదనలేక అతను పెళ్ళిచేసుకున్నాడు. అతని భార్య చాలా చక్కనిది. అతను ఆమెను ఎంతో ప్రేమగా చూడసాగాడు. అతని భార్య తన భర్తకు తల్లి మీదకూడా ప్రేమ ఉన్నట్టు తెలుసుకున్నది. "ఒకవంక తల్లిమీద ఇంత ప్రేమ ఉండికూడా నా భర్త నన్నింతగా ప్రేమిస్తున్నాడుగదా, ఈ తల్లి లేకపోతే ఇంకా ఎంత ప్రేమిస్తాడో!" అనుకుని, ఆమె తల్లి కొడుకుల మధ్య వైషమ్యాలు పెట్టటానికి నిశ్చయించింది. భర్తతో అత్తగారిమీద చాడీలు చెప్పింది. "మీ అమ్మకు నేనంటే ఏమీ పడదు. మీతో చెబితే నొచ్చుకుంటారని దాచిపెడుతున్నాను. ప్రతి దానికీ తప్పులెన్నుతుంది. భోజనం వేడిగా పెడితే వేడిగా పెట్టానంటుంది. చల్లగా పెడితే చల్లగా పెట్టానంటుంది. కాళ్ళు మెల్లిగా ఒత్తితే గట్టిగా ఒత్తమంటుంది. గట్టిగా ఒత్తితే చంపుతున్నానంటుంది. ఎంత ప్రయత్నించికూడా ఆవిణ్ణి మెప్పించలేకపోతున్నాను," అని భర్తదగ్గిర కంట తడిపెట్టుకున్నది.

సుపుత్రకుడు తన భార్య మాటలు నమ్మాడు. తానూ, తన భార్యా సుఖంగా

సి. వసుంధర

ఉండటం చూసి, ఓర్చలేనితనంచేత ముసలిది ఈ విధంగా తన భార్యను రాచిరంపాన పెడుతున్నదని అతనికి తోచింది. అందుచేత అతను ఒకనాడు తల్లితో, "అమ్మా, నీకిక్కడ సుఖంగా లేనట్టున్నది. మరెక్కడికైనా, నీ ఇష్టంవచ్చిన చోటుకు వెళ్ళి ఉంటావా ఏమిటి?" అని అడిగాడు.

కోడలు చేసిన మోసం గ్రహించి, "అలాగే పోతాను, నాయనా!" అంటూ ముసలావిడ ఆ గ్రామంలోనే బంధువుల ఇంటికి పోయి, ఆ ఇంట్లో చాకిరిచేస్తూ, వాళ్ళు పెట్టినది తింటూ, సుఖానికి దూరమై కాలం వెళ్ళబుచ్చసాగింది.

అత్తగారు ఇంటినుంచి వెళ్ళిపోయిన కొంతకాలానికి కోడలు గర్భవతి అయి, తొమ్మిది నెలలూ మోసి ఒక మగపిల్లవాణ్ణి కన్నది. "మా అత్తగారు ఎటువంటి మనిషి అనుకోవాలి! ఆవిడ ఉన్నంతకాలమూ నాకు కడుపూ గడ్డలూ లేదు. ఆవిడ వెళ్ళగానే పండంటి పిల్లవాడు కలిగాడు!" అని ఆమె అమ్మలక్కలతో అన్నది. ఈ మాటలు కొందరు నమ్మారు. మరికొందరు తంపులమారివాళ్లు ముసలావిడవద్దకు వెళ్లి, "చూశావా, మీ కోడలు ఏమంటున్నదో? నువు అక్కడ ఉన్నన్నాళ్ళూ నీ కోడలికి



పిల్లలే కలగలేదుట. నువు వెళ్లిపోవటంచేత పిల్లవాణ్ణి కన్నదిట!" అని చెప్పారు.

ముసలావిడకు ఈ మాట వినగానే మండిపోయింది. "ఇంకేముందీ? ధర్మమే చచ్చింది! దానికి దినవారాలు పెడతాను!" అంటూ ఆవిడ ఇన్ని నీళ్ళూ, బియ్యమూ, నువ్వులూ కట్టుకుని శ్మశానానికి వెళ్లింది. అక్కడ పొయి చేసి పిడతలో బియ్యం పోసి వండనారంభించింది.

ఆ సమయానికి అటుగా ఒక మునీశ్వరుడు వెళుతూ ముసలిదాన్ని చూసి, "ఏం, తల్లీ? ఎవరు పోయారు? ఎందుకీ శ్మశానంలో వంటచేస్తున్నావు?" అని అడిగాడు.

"నీకు తెలీదా, నాయనా? ధర్మం చచ్చింది. అందుకని దానికింత పిండం వేస్తున్నాను!" అన్నది ముసలావిడ.

"ధర్మం చావటమేమిటి? ఎవరన్నారు నీతో?" అని అడిగాడు మునీశ్వరుడు.

"ఎవరనాలి, నాయనా? అధర్మం విజృంభించటం లేదూ? నామీద నానా మాటలూ చెప్పి, నన్ను ఇంటోనుంచి వెళ్ల గొట్టించినాక నా కోడలు పండంటి పిల్లాణ్ణి కన్నదిగా? ధర్మం చావలా?" అన్నది ముసలావిడ కోపంగా.

మునీశ్వరుడు ఆవిడద్వారా జరిగినదంతా విని, "పెద్దదాన్ని నిన్ను కొడుకూ, కోడలూ ఇంత చేస్తారుగా? ఇప్పుడే వాళ్లను నా తపశ్శక్తితో భస్మీపటలం చేస్తాను, చూడు!" అంటూ కమండలోదకం చేతులో పోసుకోబోయాడు.

వెంటనే ముసలావిడ అడ్డొచ్చి, "ఊరుకో, నాయనా, ఊరుకో! వాళ్ళు నన్ను అంటే అన్నారులే! వాళ్ళు కాస్తా పోతే నా మనవడు దిక్కులేనివాడైపోతాడు—నా బంగారు నాయన!" అన్నది.

కళ్ళ చూడనైనా చూడని మనవడిమీద ముసలావిడకు గల మమకారం చూసి నవ్వుకుంటూ మునీశ్వరుడు వెళ్లిపోయాడు.

ఈలోపుగా, ఈ వార్త ఊరంతా పాక్కింది. సుప్రతకుడూ, అతని భార్యా మరికొందరూ పరిగెత్తుకుంటూ శ్మశానానికి వచ్చారు.

"ఇదేం పని? రా అమ్మా, ఇంటికి పోదాం!" అన్నాడు కొడుకు.

తన ఆట కట్టినట్టు కోడలు గ్రహించింది. తన మోసం బయట పడుతుందని భయపడి, "బుద్ధి గడ్డితిని ఏమో అన్నాను. క్షమించు, అత్తయ్యా!" అని అత్త కాళ్లమీద పడింది.

ముసలావిడ మెత్తబడి, వాళ్ళతోపాటు వెళ్లిపోయింది. ఆవిడ మనవణ్ణి చూసి ఆనందిస్తూ, జరిగినదంతా క్షణంలో మరిచిపోయి, సుఖంగా ఉన్నది.






# భువన సుందరి

ఫ్రిజియా అనే దేశంలో ట్రోయ్ అనే నగరానికి వర్ధనుడు రాజుగా ఉండేవాడు. అయన భార్య గర్భిణిగా ఉండి ఒక కల కన్నది. ఆ కలలో ఆమెకు తన గర్భాన ఒక కొరివి పుట్టినట్టూ, దానినుంచి బయలుదేరిన అగ్నికీలలు ట్రోయ్‌నగరాన్ని తగలపెట్టేసినట్టూ కనిపించింది. ఆమె భయంతో కేకలు పెడుతూ నిద్రలేచి, తన కలను గురించి భర్తకు చెప్పేసింది.

వర్ధనుడి కొడుకులలో జ్ఞాని అనేవాడు రానున్నది చెప్పగలవాడు. అందుచేత వర్ధనుడు జ్ఞానికి కలనుగురించి చెప్పాడు. "పుట్టబోయేవాడు నగరానికి అరిష్టం తెస్తాడు. అందుచేత వాడు పుట్టగానే చంపించు!" అని జ్ఞాని సలహా ఇచ్చాడు.

ఒకనాడు చీకటి పడబోతూన్న సమయాన వర్ధనుడి భార్య ఒక మగ శిశువును కన్నది. ఆ శిశువును వెంటనే చంపెయ్యక, వర్ధనుడు ఆ పని చేసే భారాన్ని తన పశువుల మందల నాయకుడి పైన వేశాడు. పసుల కాపరి తన మందలతోసహా ఐడా పర్వతం మీద వుంటూ వుంటాడు. అతను రాజాజ్ఞ ప్రకారం శిశువును తీసుకుని ఐడా పర్వతానికి వెళ్ళిపోయాడు.

కాని ఆ పసిపాపను చంపటానికి పసుల కాపరికి చేతులు రాలేదు. అతను ఆ శిశువును ఒక శిఖరంమీద చావటానికి వదిలేసి తన ఇంటికి వెళ్లిపోయాడు. కాని ఆ శిశువు చావలేదు. ఎందుచేతనంటే, ఎక్కడినుంచో ఒక ఆడ ఎలుగుబంటి వచ్చి, ఆ దిక్కులేని






శిశువుకు తన పాలిచ్చి, ఎండనుంచీ, చలి నుంచీ శిశువును కాపాడింది.

అయిదు రోజుల అనంతరం పసులకాపరి తిరిగి ఆ శిఖరానికి వెళ్లి, ఎలుగుబంటి సంరక్షణలో సుఖంగా వున్న శిశువును చూసి ఆశ్చర్యచకితుడయాడు. అతనికి ఇదేదో దైవమాయ అనిపించింది. ఆ శిశువుకు చచ్చేయోగం లేనట్టు కనబడింది. ఎలుగుబంటి ఎడంగా పోగానే ఆ పసుల కాపరి ఆ శిశువును తన సంచీలో పెట్టి ఇంటికి తెచ్చుకుని సాకసాగాడు. చాలా అందంగా ఉండటంచేత ఆ శిశువుకు మోహనుడు అనే పేరు వచ్చింది.

ఈ విధంగా చావు తప్పించుకున్న మోహనుడు, పసులకాపరి యింట పెరుగుతూ పెద్దవాడు కాసాగాడు. బాల్యంనుంచి కూడా అతనిలో గొప్ప తెలివితేటలూ, శరీర బలమూ, సౌందర్యమూ పొడకట్టాయి. అతనింకా బాలుడుగా ఉండగానే కొందరు దొంగలు అతను కాసే గోవులను కాజేశారు. మోహనుడు ఒంటరిగా దొంగలమీద పడి, అందరినీ చెల్లాచెదరుగా కొట్టి, తన గోవులను తిరిగి తెచ్చుకున్నాడు.

తన మందలో ఉండే ఎద్దులకు పోట్లాట పెట్టటం మోహనుడికి సరదా. పోట్లాటలో గెలిచినదాని కొమ్ములకు పూలూ, ఓడిన దాని కొమ్ములకు గడ్డీ చుట్టేవాడు. తన ఎద్దులలో ఏదైనా మిగిలినవాటన్నిటినీ ఓడించినప్పుడు, అతను దాన్ని ఇతర మందలలోని ఎడ్లమీద పోటీ పెట్టేవాడు. పందెంలో తన ఎద్దును ఓడించినదాని కొమ్ములకు బంగారు తొడుగు బహుమానం యిస్తాననేవాడు.

* * *

ఐడా పర్వతంమీద మోహనుడు గొర్రెల కాపరి జీవితం గడుపుతున్న సమయంలో దేవలోకంలో ఒక చిత్రం జరిగింది. ఒక చోట పెళ్లి జరుగుతూండగా అనేకమంది





దేవతలు చేరారు. ఆ సమయంలో కలహ ప్రియ అనే దేవత అతిథుల మధ్య ఒక బంగారు ఫలం పడేసింది. ఆ పండు పైన "అత్యంత సౌందర్యవతికి" అని రాసి వుంది. పెళ్ళికి అతిథులుగా వచ్చిన ఆడ దేవతలలో ముగ్గురు మాత్రమే ఆ పండు కోసం పోటీపడ్డారు. వారెవరంటే, భూపుత్రి, బుద్ధిమతి, కామిని.

ఆ ముగ్గురిలోనూ ఉత్తమ సౌందర్యవతి ఎవరో తేల్చినవారు లేకపోయారు. ఆ కారణంచేత వారు నేరుగా దేవనాథుడి వద్దకు వెళ్ళి, తమ ముగ్గురిలో అత్యంత సౌందర్యవతి ఎవరో తీర్పు ఇవ్వమన్నారు.

"ఈ తీర్పు నావల్ల అయేది కాదు. ఐడా పర్వతంమీద ఉంటున్న మోహనుడి వద్దకు వెళ్ళి మీ తగాదా పరిష్కారం చేసుకోండి!" అని దేవనాథుడు ఆ ముగ్గురికీ సలహా ఇచ్చాడు.

ముగ్గురు అప్సరలూ ఐడా పర్వతం మీదికి చేరే సమయాన మోహనుడు ఆ పర్వతంపై గల శిఖరాలలోకల్లా ఎత్తయిన శిఖరంమీద గోవులను మేపుతున్నాడు. వారు అతన్ని సమీపించి, బంగారు ఫలం అతని చేతిలో పెట్టి, "మోహనా, నువు కూడా అందగాడవు, బుద్ధిమంతుడవు. మాలో ఎవరి అందం గొప్పదో నిర్ణయించి ఈ ఫలం వారికి ఇయ్యి. ఇది దేవనాథుడి ఆజ్ఞ!" అన్నారు.

"నేను పశువులను తోలుకునే సామాన్య మానవుణ్ణి. నాకు దేవతా సౌందర్యం ఏం తెలుసు? ఈ పని నావల్ల ఏమవుతుంది? కావలిస్తే ఈ పండును మూడు సమ భాగాలుగా కోసి ఇస్తాను, ముగ్గురూ మూడు ముక్కలు తీసుకోండి," అని మోహనుడు అమాయికత్వం నటించాడు.

"ఇది దేవనాథుడి ఆజ్ఞ! జవ దాటితే ప్రమాదం!" అని ఆ ముగ్గురూ, మోహనుణ్ణి భయపెట్టారు.



"అయితే నిర్ణయిస్తాను. మీరు నా నిర్ణయానికి తల ఒగ్గాలిగాని, నామీద ఓడినవారు ఆగ్రహించకూడదు. మానవ మాత్రుడినైన నేను పొరపాటు నిర్ణయిస్తే మీరు సహించాలి," అన్నాడు మోహనుడు.

ఇందుకు ముగ్గురూ ఆమోదించారు.

"మీరు ముగ్గురూ ఒక్కసారి కనబడు తుంటే నేను ఏ ఒకరినీ సరిగా చూడ లేకుండా ఉన్నాను. అందుచేత మీరు దూరంగా వెళ్ళిపోయి, ఒక్కొక్కరుగా నాదగ్గిరికి రండి!" అన్నాడు మోహనుడు.

ముగ్గురూ చాటుకు వెళ్లిపోయారు. మొదట భూపుత్రి అతనివద్దకు వచ్చింది. అతను తన అందం పరీక్షించటానికిగాను ఆమె గుండ్రగా తిరుగుతూ, "చూడు, మోహనా! ఆ పండు నాకిచ్చావంటే ఏ యుద్ధంలోనూ నీకు అపజయమన్నది లేకుండా చేస్తాను. అందంలోగాని తెలివి లోగాని ప్రపంచంలో నీతో సమానుడు లేకుండా వరమిస్తాను," అన్నది.

"నేను గొడ్లకాపరిని, తల్లీ! నాకు యుద్ధా లెందుకు? విజయా లెందుకు?" అన్నాడు మోహనుడు.

ఆమె వెళ్ళిపోయి, బుద్ధిమతి వచ్చింది. "మోహనా, ముగ్గురిలోనూ నేనే సౌందర్య వతిగా నిర్ణయించావంటే, నిన్ను ఆసియా



కంతకూ రాజు చేస్తాను. ప్రపంచంలోకల్లా నీకన్న ధనికుడు లేకుండా వరమిస్తాను!" అన్నది ఆమె అతనితో.

"నేను లంచం పుచ్చుకుని తగాదా పరిష్కరించను. క్షమించండి!" అన్నాడు మోహనుడు.

కామిని అఖరున వచ్చింది. ఆమె అతన్ని చూస్తూ, "అయ్యో, మోహనా, ఫ్రిజియా మొత్తంమీద నీ అంత అందగాడు లేడు! అటువంటి వాడికి నిజంగా, స్పార్టాదేశపు రాజకుమార్తె భువనసుందరి భార్య కాతగినది. ఆమెను మించిన సౌందర్యవతి భూలోకంలో లేదు!" అన్నది.

"ఆమె పేరే వినలేదు," అన్నాడు మోహనుడు.

"వినలేదా? గ్రీస్‌లో ఉండే రాజకుమారులందరూ ఆమెను పెళ్ళాడతామని వచ్చారు. కాని ఆమె రారాజు తమ్ముడైన ప్రతాపుణ్ణి పెళ్ళాడేసింది. కావాలంటే ఆమె నీకు లభిస్తుంది!" అన్నది కామిని.

"ఆమెకు అదివరకే వివాహమయిందిగా, కావాలంటేమటుకు నాకెలా లభిస్తుంది?" అన్నాడు మోహనుడు.

కామిని నవ్వి, "ఏమైతే? నిన్ను చూడగానే నీపై ఆమెకు ప్రేమ కలిగేటట్టు నేను చెయ్యగలను. ఆ తరవాత ఆమె యిల్లూ,





వాకిలీ, భర్తా, సంసారమూ అన్నీ మరిచి నీవెంట పడి వచ్చేస్తుంది," అన్నది.

"భువనసుందరి నిజంగా అంత అందగత్తెనా?" అన్నాడు మోహనుడు.

"పిచ్చివాడా, ఆమె సౌందర్యం నా సౌందర్యానికి ఏమీ తగ్గదు," అన్నది కామిని నవ్వుతూ.

"ఆమెను నా కిప్పిస్తానని ప్రమాణం చేస్తావా?" అన్నాడు మోహనుడు.

కామిని ప్రమాణం చేసింది. మోహనుడు బంగారు ఫలాన్ని ఆమెకు బహూకరించాడు. ఇందువల్ల మిగిలిన ఇద్దరు అప్సరసలకూ అతనిపై ఎంతో ఆగ్రహం కలిగింది. కాని



వారు అతని తీర్పుకు బద్ధులమై ఉంటామని మాట యిచ్చి ఉండటంచేత తమ ఆగ్రహాన్ని దిగమింగుకున్నారు.

*　　*　　*

భువనసుందరి నిజంగానే అపురూప సౌందర్యవతి. అమితమైన సౌకుమార్యం గలది. ఆమె సాక్షాత్తూ దేవనాథుడికీ, మానిని అనే ఆమెకూ పుట్టింది. ఆమె ఒక హంస గుడ్డులోనుంచి పుట్టి వచ్చిందని ప్రతీతి. బాల్యంనుంచీ ఆమెను స్పార్టా రాజైన మర్దనుడు పెంచి పెద్దదాన్నిచేశాడు. ఆమెకు పెళ్ళిచేయదగిన వయసు వచ్చేసరికి గ్రీసులో ఉన్న ఎంతోమంది రాకుమారులు ఆమెను పెళ్ళాడ గోరి స్పార్టాకు వచ్చారు. అలా వచ్చినవారిలో దేవమయుడు, ప్రతాపుడు, భూధవుడు, రూపధరుడు మొదలైనవారున్నారు. వీరిలో రూపధరుడు ఒక్కడే ఉత్త చేతులతో వచ్చాడు; మిగిలిన వారంతా భువనసుందరికి అంతులేని కానుకలు తెచ్చారు.

మర్దనుడికి పెద్ద చిక్కే వచ్చిపడింది. ఇందరిలో భువనసుందరిని ఎవరికని ఇవ్వటం. ఎవరికిచ్చినా మిగిలినవారంతా కయ్యానికి రావచ్చు. అందుచేత ఆయన ఏ ఒక్కరికీ తన కుమార్తె నివ్వనని చెప్పి





సాగనంప లేదు ; ఎవరు తెచ్చిన కానుకలనూ స్వీకరించనూ లేదు.

తనకు భువనసుందరి నిచ్చి పెళ్ళి చెయ్యరని మొట్టమొదటినుంచీ స్పష్టంగా తెలిసినవాడు రూపధరుడు ఒకడే. అతను మర్దనుడివద్దకు వెళ్ళి, "మీకు పెద్ద చిక్కు వచ్చిపడిందని నే నెరుగుదును. నాకు మీరు ఒక్క సహాయం చెయ్యండి, నేను మీకు వచ్చిన చిక్కు విడే ఉపాయం చెబుతాను," అన్నాడు.




"నీకు నేనేమి సహాయం చెయ్యాలి? నువు నా చిక్కు ఎలా విడగొడతావు?" అని స్పార్టా రాజు మర్దనుడు అడిగాడు.

"మీ సోదరుడైన చంద్రదత్తుడి కుమార్తె పద్మముఖిని ఎలాగైనా నాకు పెళ్ళిచేసేటట్టు చూడండి. మీ కుమార్తెను యెవరి కిచ్చి పెళ్ళిచేసినా మిగిలినవాళ్ళు తగాదా పెట్టకుండా నే నొక ఉపాయం చెబుతాను," అన్నాడు రూపధరుడు.

"నీ ఉపాయం చెప్పు. నీకు పద్మముఖిని ఇచ్చి పెళ్ళిచేసే పూచీ నాది," అని మర్దనుడు మాట ఇచ్చాడు.

"అయితే ఇలా చేయండి: భువనసుందరిని పెళ్ళాడగోరి వచ్చిన రాకుమారులందరినీ పిలవండి; ఆమెను ఎవరు పెళ్ళాడినా సరే, వాడికి ఇంకోడివల్ల ప్రమాదం వచ్చే పక్షాన మిగిలినవారంతా ఆమె భర్తకు సాయం వచ్చేటట్టు అందరిచేతా ప్రమాణం చేయించండి. అలా చేసినట్టయితే ఆమె వివాహం సాఫీగా, ఎట్టి పేచీలూ లేకుండా సాగిపోతుంది," అన్నాడు రూపధరుడు.

ఈ సూచన మర్దనుడికి నచ్చింది. అయన గ్రీకు రాకుమారులందరినీ పిలిపించి, "మీరంతా భువనసుందరిని పెళ్ళాడగోరుతున్నవారే. అయితే ఆమె మీలో ఒక్కరిని మాత్రమే పెళ్ళాడగలదు. ఆమె ఎవరినైతే పెళ్ళాడుతుందో అతనిమీద మీలో



అసూయాపరు డెవడైనా ఉండి కత్తికట్ట వచ్చు. అలా జరిగే పక్షంలో మీరంతా ఆమె భర్తను సహాయం వెళతామని ప్రమాణం చెయ్యండి. ఆతరవాత ఆమెకు భర్తను నిర్ణయిస్తాను," అన్నాడు.

రాకుమారులందరూ ఆయన కోరిన ప్రకారం ప్రమాణాలు చేశారు. ఆ తరవాత భువనసుందరిని ప్రతాపుడి కిచ్చి మర్దనుడు పెళ్లిచేశాడు. కొంతకాలం గడిచాక అతడు గతించాడు. అతడి స్థానంలో ప్రతాపుడు స్పార్టాకు రాజయాడు.

భువనసుందరి వివాహం జరిగినప్పుడే, స్పార్టాలో రూపధరుడికీ, పద్మముఖికీకూడా వివాహం జరిగింది. పద్మముఖి తండ్రి అయిన చంద్రదత్తుడు తన అల్లుడితో, "బాబూ, నా కుమార్తెను విడిచి ఉండ లేను. నువు స్పార్టాలోనే ఉండిపో!" అన్నాడు. కాని ఇందుకు రూపధరుడు ఎంతమాత్రం ఒప్పక, భార్యతోసహా తన తేరు ఎక్కి ఇథాకాకు బయలుదేరాడు. చంద్రదత్తుడు వెర్రివాడులాగా రథం వెంట పరిగెత్తుతూ, "నా తల్లీ, వెళ్ళిపోకు! వెళ్ళి పోకు!" అని కేకలు పెట్టసాగాడు.

మామగారి ఈ ప్రవర్తనను రూపధరుడు ఎంతోసేపు సహించలేక పోయాడు. అతను తన భార్యవేపు తిరిగి, "ఏమిటిది? నువు వస్తే బుద్ధిపూర్వకంగా నావెంట వచ్చెయ్యి. లేదా, నన్ను విడిచిపెట్టి, మీ నాన్న వెంట తిరిగి పో!" అన్నాడు. పద్మముఖి ఏ సమాధానమూ చెప్పక, తన నెత్తిమీది మేలి ముసుగు ముఖంమీదికి లాక్కున్నది.

ఇది చూసి చంద్రదత్తుడు తప్పు తనదే నని, భర్తవెంట వెళ్లిపోవటం తన కుమార్తె ధర్మమనీ తెలుసుకున్నాడు. ఈ సంఘటన జరిగిన చోట ఆయన తన కుమార్తె శిలా ప్రతిమ ఒకటి స్థాపించాడు. ఈ ప్రతిమ స్పార్టానగరానికి నాలుగు మైళ్ళ దూరాన ఇప్పటికీ ఉన్నది. (ఇంకా వుంది)



# చిమ్మట - దాని జీవితం

చిమ్మటలూ, సీతాకోకచిలకలూ చూడటానికి చాలా అందంగా ఉంటాయి. వాటిలో అనేక రకాల రంగులుంటాయి. అయితే మనం వాటిని చూసి ఆనందించే సమయానికి వాటి జీవితం ముగియవస్తూ ఉంటుంది. ఒక చిమ్మట జీవితాన్ని గురించి తెలుసుకున్నట్టయితే మనకీ విషయం బోధపడుతుంది.

ఆడచిమ్మట ఆకులమీద గుడ్లు పెడుతుంది. ఆ గుడ్లనుంచి కాలక్రమాన అతి సన్నని ఆకుపురుగులు బయటికి వస్తాయి. ఇవి ఆకులను తిని జీవిస్తూ క్రమంగా పెద్దవవుతాయి. ఆకుపురుగులు పెద్దవయేటప్పుడు వాటి శరీరాలతోబాటు చర్మంకూడా పెరగదు. ఒక దశలో చర్మం చిట్లిపోతుంది. ఇంకొక చర్మంతో ఆకుపురుగు బయటికి వచ్చి మరికొంతకాలం పెరుగుతుంది. కొన్ని ఆకుపురుగులు మూడు, నాలుగుసార్లు చర్మాన్ని మార్చటం జరుగుతుంది. ఒక్కొక్కప్పుడీ ఆకుపురుగులు మనిషి వేలి మందాన, మూడంగుళాల నిడివి గల ఆకుపచ్చ శరీరాలతో మనకు చెట్లపై కనిపిస్తాయి.

పెరగటం పూర్తికాగానే ఆకుపురుగు తన నోటినుంచి సన్నని దారం తెప్పించి, ఆ దారంతో తనచుట్టూ తాను అతినేర్పుగా గూడు అల్లుకుంటుంది. ఈ గూడు తనను అన్నిపక్కలా కప్పిఉండేటట్టుగానూ, తాను రెక్కలపురుగురూపంలో చీల్చుకురావటానికి బలహీనమైన ద్వారం ఉండేటట్టుగానూ అల్లుకుంటుంది. అలా అల్లిన గూటినుంచి రెక్కలపురుగు వెలువడి వచ్చేలోపుగా గూటిలోపల అతి విచిత్రమైన పరిణామాలు జరుగుతాయి. చివరకు చిమ్మట బయటికి వస్తుంది. ఆక్షణంలో దాని శరీరం తడిసినట్టుంటుంది, కానిత్వరలోనే ఆరిపోతుంది.

గూటినుంచి బయటికి వచ్చిన చిమ్మటకు గుడ్లు పెట్టటం తప్ప మరి జీవితం లేదు! పట్టుపురుగులు చిమ్మటలే. వాటి తాలూకు ఆకుపురుగులు అల్లే గూడునుంచే మనకు పట్టు లభిస్తున్నది.



# నష్టమైన విద్య

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి శవాన్ని దించి భుజాన వేసుకుని, మళ్లీ శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అర్ధరాత్రివేళ హాయిగా హంస తూలి కా తల్పాన పడుకుని నిద్రపోవలిసిన నీవు, ఈ విధంగా ఉపాసకుడిలాగా యెందుకు శ్రమపడుతున్నావో నాకు తెలియదు. ఉపాసనలు ఎల్లప్పుడూ ఫలించవు. దానికి దృష్టాంతంగా ఒక విచిత్రమైన కథ చెబుతాను విను," అంటూ ఈ కింది కథ ఆరంభించాడు :

పూర్వం ఉజ్జయినీ నగరాన్ని చంద్రప్రభుడనే రాజు పరిపాలిస్తూ వుండేవాడు. ఆయనకు దేవస్వామి అనే బ్రాహ్మడు మంత్రిగా ఉండేవాడు. ఎంతో ధనికుడైన ఆ మంత్రికి చంద్రస్వామి అనే ఒక కొడుకుండేవాడు. వాడు చిన్నతసంలో సరిగానే

## బేతాళ కథలు

చదువుకున్నాడుగాని, పెద్దవాడవుతూనే జూదంలో పడిపోయాడు. అతనికి రాత్రిం బగళ్లు జూదం ఆడటం తప్ప ఇంకొక ఆలోచనే లేదు.

ఒకనాడు అతను ఒక వీధిని పోతూం డగా ఒక జూదపు అంగడి కనిపించింది. జూదగాళ్ల సందడి విని చంద్రస్వామి ఆ అంగడిలో ప్రవేశించాడు. నలుగురితోబాటు తానుకూడా జూదం ఆడసాగాడు. దుర దృష్టంవల్ల అతనిదగ్గిర వున్న డబ్బంతా పోవటమేగాక, అతను మిగిలినవాళ్లకు బాకీ పడ్డాడుకూడా. వాళ్లు సొమ్మివ్వమన్నారు. అతనెవరో వారికి తెలియదు. "నేను మంత్రిగారి కొడుకును," అంటే వాళ్ళు అంత తొందర చెయ్యరు. కాని ఆ మాట వాళ్ళతో చెబితే, తాను జూదం ఆడుతున్న సంగతి తండ్రికి తెలిసి తన పరువూ, తండ్రి పరువూకూడా పోతుందని చంద్ర స్వామి ఏమీ అనక అన్నింటికీ తల ఒగ్గి ఊరుకున్నాడు.

జూదరులు చంద్రస్వామిమీద ఆగ్ర హించి కర్రలతో మెత్తగా తన్నారు. చంద్ర స్వామి స్పృహతప్పినట్టు పడిపోయాడు. జూదపు అంగడివాడు రాత్రిదాకా చూశాడు. పడిపోయిన చంద్రస్వామి కదలనే లేదు. అతను చచ్చిపోయివుంటాడని అంగడి





వాడికి భయంవేసింది. అందుచేత వాడు అర్ధరాత్రివేళ తన నౌకర్లను పిలిచి, "వీణ్ణి తెల్లవారేలోపుగా అడవిలో ఏ పాడు నుయ్యో చూసి పారేసి రండి!" అని చెప్పాడు. నౌకర్లు చంద్రస్వామిని మోసుకుని చీకటిలో అరణ్యానికి వెళ్ళారు. ఎంత దూరం వెళ్ళినా వారికి పాడుబడిన నుయ్యిగాని, గొయ్యిగాని కనపడలేదు. బరువేమో అడుగడుగుకూ హెచ్చుతున్నట్టు తోచింది.

"ఈ శవాన్ని ఇంకా యెంత దూరం మోస్తాం? ఇక్కడెక్కడా నుయ్యి లేదు. వీణ్ణి యిక్కడే వదిలి పోయి మన యజమానితో నూతిలో పారేశామని చెప్పేద్దాం!" అని కూడబలుక్కుని, నౌకర్లు చంద్రస్వామిని అడవిలో ఒక చోట పడవేసి తిరిగి వెళ్ళిపోయారు.

వెంటనే చంద్రస్వామి లేచాడు. కాని దెబ్బలతో శరీరమంతా నజ్జు అయివున్నది. అతను బాధతో నడుచుకుంటూ తెల్లవారే సరికి ఒక యోగి వుండే ఆశ్రమం చేరాడు. యోగి అతన్ని చూడగానే, "రా, నాయనా! శోషపోయినట్టున్నావు. నీకు కావలసిన భోజనం ఇస్తాను, రా!" అని ఆహ్వానించాడు. నట్టడవిలో ఉండే ఈ జడదారి తనకు కావలసిన భోజనం యెలా పెడతాడా అని చంద్రస్వామి ఆశ్చర్యపడ్డాడు.

కాని ఆ యోగి అనేక సిద్ధులు కలవాడు. ఆయన ఒక శక్తిని ఆవాహన చేసి, "ఈ అతిథికి ఆతిథ్యం చెయ్యి!" అన్నాడు. వెంటనే చంద్రస్వామి చుట్టూ ఒక బంగారు నగరం ప్రత్యక్షమయింది. అతని యెదట ఒక దివ్యభవనం కనిపించింది. ఆ భవనంలోనుంచి అనేకమంది స్త్రీలు వచ్చి, "అయ్యా, దయచెయ్యండి!" అని చంద్రస్వామిని ఆహ్వానించారు.

అతను వారివెంట వెళ్ళాడు. వారు అతనిచేత చక్కగా స్నానం చేయించి, కట్టుకోవటానికి వెలలేని బట్టలిచ్చారు.



అతని శరీరానికి అగరు గంధం పూశారు. తరవాత అతనికి దివ్యమైన భోజనం పెట్టారు. భోజనం చేసేటప్పుడు ఒక దివ్య సుందరి వచ్చి అతని సరసనే కూచుని భోజనం చేసింది. భోజనం చేసి అతను హంసతూలికా తల్పం మీద పడుకుని నిద్రపోయాడు. బడలిక తీరి నిద్రలేచాక తాపీగా ఆ యువతినిగురించి విచారించుదా మనుకున్నాడు.

కాని అతను నిద్రలేచి చూసేసరికి ఎదురుగా యోగి వుండే పర్ణశాలా, చుట్టూ అడవి మాత్రమే వున్నది. నగరం లేదు, స్త్రీలు లేరు, భవనాలూ లేవు. యోగి అతని దగ్గిరికి వచ్చి, "ఏం, నాయనా? ఆతిథ్యంలో ఏ లోటూ రాలేదుగద? నీకు అంతా సుఖంగా జరిగిందా?" అని అడిగాడు.

"తమ దయవల్ల అంతా సుఖంగానే జరిగింది. కాని నే నొక దివ్యసుందరిని చూశాను. ఆమెతో పరిచయం చేసుకోవాలని నాకు చాలా కుతూహలంగా ఉంది," అన్నాడు చంద్రస్వామి.

"పిచ్చివాడా, నీవు చూసినదంతా నిజమనుకున్నావా? అది నా విద్యాప్రభావం చేత సృష్టించిన భ్రమమాత్రమే," అన్నాడు యోగి నవ్వుతూ.



"అయితే, నా మీద దయవుంచి ఆ విద్యను నాకుకూడా దయచేయించండి, మహానుభావా!" అని చంద్రస్వామి యోగిని వేడుకున్నాడు.

"నాయనా, ఈ విద్య సులువుగా అబ్బేది కాదు. దీనికోసం నీవు ప్రయత్నించలేవు. దీనికోసం నీటిలో మునిగి జపం చెయ్యాలి. ఈ జపంలో వున్న సాధకుణ్ణి మాయ చుట్టేస్తుంది. తాను మళ్లీ పుట్టినట్టూ, పెరిగి పెద్దవాడై పిల్లలను కనినట్టూ భ్రమ కలుగుతుంది. అదంతా నిజమేననుకుని వాడు తన సాధనను మరిచిపోతాడు. అలా మరిచిపోకుండా ఎవడైతే ఇరవైనాలుగేళ్ళపాటు

ఆ భ్రమ జీవితం గడిపి, ఆ భ్రమలోనే అగ్నిప్రవేశం చేస్తాడో, అటువంటి సాధకుడు విద్యను సాధించి నీటినుండి బయటికి వస్తాడు. సామాన్యులకు ఈ విద్య సిద్ధించదు," అన్నాడు.

చంద్రస్వామి మొండిపట్టు పట్టి, "అలా కాదు. విద్య నేను సిద్ధింపజేసుకుంటాను. మీరు అనుగ్రహించండి," అన్నాడు.

"నీకు విద్య సిద్ధించకపోతే, నీ సాధన విఫలం కావటమే గాక, తగనివాడి కిచ్చినందుకు నేను సాధించిన విద్యకూడా నష్టమైపోతుంది సుమా!" అని యోగి, చంద్రస్వామిని హెచ్చరించాడు.

"తమకు యెలాటి నష్టమూ నేను కలగనివ్వను," అన్నాడు చంద్రస్వామి.

యోగి అతని మాట తీసివెయ్యలేక విద్య నివ్వటానికి నిశ్చయించుకుని, "సరే, నీవు నీటిలో మునిగిన తరవాత అగ్నిప్రవేశం చెయ్యవలిసి వచ్చినప్పుడు నేను హెచ్చరిక చేస్తాను. సంకోచించకుండా అగ్నిప్రవేశం చెయ్యి. ఒకవేళ అది భ్రమేనన్న విషయం మరిచిపోతే, నేను హెచ్చరించినప్పుడైనా జ్ఞప్తి తెచ్చుకో," అన్నాడు. అందుకు చంద్రస్వామి సరేనన్నాడు.

తరవాత యోగి తాను స్నానంచేసి, చంద్రస్వామిచేత స్నానం చేయించి ఒక



మంత్రం ఉపదేశించి, నీటిలో మునిగి కూచుని మంత్రం జపించమన్నాడు. అంతా యోగి చెప్పినట్టే జరిగింది. తాను ఒక బ్రాహ్మడి ఇంట పుట్టినట్టు చంద్రస్వామికి తోచింది. తరవాత అతను పెరుగుతూ, ఉపనయనం చేసుకుని విద్యాభ్యాసం సాగించాడు. తరవాత అతని పెళ్లయింది. అతనికి పిల్లలు కలిగారు. వారు పెరిగి పెద్దవారవుతున్నారు. అతని జీవితం, అన్నివిధాలా సుఖంగా వెళ్లిపోతున్నది.

ఇంతలో చంద్రస్వామికి గురువు చేసిన హెచ్చరిక వినబడింది. తాను విద్యాసిద్ధి కోసం జపం చేస్తున్న సంగతి స్ఫురణకు వచ్చింది. ఇక అగ్నిప్రవేశం చెయ్యాలి. ఆ భ్రమలోనే అతను అగ్నిప్రవేశానికి అంతా సిద్ధంచేశాడు. కాని అతని బంధువులూ, పెద్దలూ, భార్యా, బిడ్డలూ చుట్టూ మూగి, "అయ్యయ్యో! వద్దు, వద్దు!" అని ఆక్రోశించ సాగారు. అతనికి భయంపుట్టింది. "నేను చచ్చిపోతే వీరంతా ఏమవుతారు?" అనుకున్నాడు. యోగి అగ్నిప్రవేశం చెయ్యమన్న మాట జ్ఞాపకం వచ్చింది. ఆయన తెలిసి చెప్పాడో, తెలియక చెప్పాడో అని సందేహం కలిగింది. అయినా చంద్రస్వామి మనస్సు రాయి చేసుకుని అగ్నిలో ప్రవేశించాడు. కాని అగ్ని కాలలేదు. చంద్రస్వామి





నీటిలో లేచి నిలబడ్డాడు. అతడికి భ్రమ అంతా వదిలిపోయింది. ఒడ్డున నవ్వుతూ యోగి నిలబడి వున్నాడు.

చంద్రస్వామి యోగివద్దకు వచ్చి నమస్కరించి, "స్వామీ, అంతా తమరు చెప్పిన ప్రకారమే చేశాను. కాని అగ్ని ప్రవేశం చేసినప్పుడు అగ్ని చల్లగా వుందేం?" అని అడిగాడు.

"నువు ఏదో తప్పు చేసివుంటావు. అగ్ని చల్లగా వుండటమేమిటి? ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు యోగి.

"నేను సరిగా తమరు చెయ్యమన్నట్టే చేశాను," అన్నాడు చంద్రస్వామి.

"నిజం ఇప్పుడే తెలుసుకుందాం!" అంటూ యోగి తన విద్యను అవాహన చేశాడు. కాని విద్య రాలేదు.

యోగి, కంట నీరు పెట్టుకుంటూ "నీకు విద్య రాకపోగా నాకు వచ్చినదికూడా పోయింది!" అన్నాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, చంద్రస్వామి అంతా సరిగానే చేశాడుగదా, అతనికి విద్య ఎందుకు రాలేదు? గురువుకున్న విద్యకూడా యెందుకు పోయింది? ఈ సందేహం నాకు తీరలేదు. తెలిసికూడా నా సందేహం తీర్చకపోయావో నీ శిరస్సు పగిలిపోతుంది," అన్నాడు.

"నాచేత మాట్లాడించటానికి అడుగుతున్నావుగాని, ఇందులో సందేహానికి అవకాశం ఏమున్నది? చంద్రస్వామి తన భ్రమను నిజమనుకుని అగ్నిలో దూకటానికి పస్తాయించాడు. ఆ కారణంచేతనే అతనికి విద్య దక్కలేదు. అపాత్రుడికి విద్య ఇచ్చిన కారణంచేత గురువుకుండిన విద్యకూడా నష్టమైపోయింది," అన్నాడు విక్రమార్కుడు.

ఈ విధంగా రాజుకు తిరిగీ మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

**1956 డిసెంబరు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు**





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబరు 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## అక్టోబరు నెల ఫోటో ఫలితాలు

మొదటి ఫోటో : కల్లా కపటము కాననివారికి...

రెండవ ఫోటో : కష్టా లెప్పుడు తప్పవు రన్నా!

పంపినవారు : డి. ఎల్. సరోజిని, V క్లాస్, బాలికల ప్రభుత్వ ఉన్నత పాఠశాల, నిజామాబాదు - హైదరాబాద్ - (దక్కన్)

బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# ఇంద్రజాలము

ప్రొఫెసర్ పి. సి. సర్కార్

టోపీ పైభాగంకుండా పేక ముక్కను లాగటం మంచి ట్రిక్కు. దానిని నేను మొదటినుంచీ విజయవంతంగా చేస్తూ వస్తున్నాను. ఏదో ఒక పేకముక్క, ఇస్పేటు జాకీ అనుకోండి, తీసుకుని దానిని టోపీలో పెట్టి, ప్రేక్షకులందరూ చూస్తూండగా, టోపీ పైభాగంకుండా కొంచెం కొంచెమే పైకి లాగి తీయటమే ఈ ట్రిక్కులో ఉన్న విశేషం. టోపీ పైభాగాన కంత ఏమీ లేదని చూపటానికిగాను టోపీని ముందుగా ప్రేక్షకులకు చూపాలి.

ఈ ట్రిక్కు చెయ్యటానికిగాను యూరోపియనులు సాయంకాలంపూట ధరించే టాప్ హాట్, లేక ఓపెరా హాట్ ఉపయోగించాలి; ఎందుకంటే, దాని పైభాగం బల్లపరుపుగా, నున్నగా ఉంటుంది. టోపీ నల్లరంగు గలదై కూడా ఉండాలి.

ఇంద్రజాలికుడు ఇస్పేటు జాకీ ముక్క తీసుకుని, దానిని పదునైన కత్తితో నాలుగు సమభాగాలుగా కోస్తాడు. తరవాత ఆ ముక్కలను నల్లని వెల్వెట్ గుడ్డపై అంటిస్తాడు. టోపీపైన ఉండే గుడ్డలాటిదే ఇందుకు కూడా వాడాలి. ముక్కలు అరి, బిగిసిన తరవాత, వాటి చుట్టూ ఉండే గుడ్డను జాగర్తగా కత్తిరించేసి, ఇలా తయారైన "మాయ" పేక ముక్క పక్కలకుకూడా నల్లరంగు పూయాలి. అప్పుడు ఆ ముక్కను టోపీ పైభాగాన బోర్లా పెట్టినట్టయితే, ఎవరూ తెలుసుకోలేరు. పక్క పుటలో ఉన్న బొమ్మలను చూసినట్టయితే పైన చెప్పిన విషయాలు సులువుగా బోధపడతాయి.

"మాయ" పేకముక్క మొదటినుంచీ టోపీ పైభాగాన బోర్లా పెట్టబడే ఉంటుంది. తరవాత ఒక పేక తీసు

కుని అందులోనుంచి ఒక నిజమైన ఇస్పేటు జాకీ ముక్క పైకి తీయాలి. ఆ తరవాత ఆ ముక్కను టోపీ లోపల పెడుతున్నట్టు నటిస్తూ, చొక్కాచేతిలో దాచెయ్యాలి. చెయ్యి టోపీలోపల ఉంటుంది గనక ఇది సులువుగా చెయ్యవచ్చు.

తరవాత ఇంద్రజాలికుడు టోపీ లోపలి ముక్కను టోపీ పైభాగంనుంచి పైకి తోస్తున్నట్టుగా అభినయిస్తాడు. ముక్కను కొంచెం కొంచెమే పైకి తోస్తున్నట్టు అభినయించటం చాలా అవసరం. (ఇంద్రజాలికుడి విజయం చాలావరకు ప్రదర్శనా సామర్థ్యంమీద ఆధారపడి ఉంటుందనేది ముఖ్యంగా గమనించాలి.)







ఇంద్రజాలికుడు కిందినుంచి ఒక్కొక్క తోపు తోసినప్పుడల్లా, మాయ ముక్క తాలూకు A, B, C, D భాగాలలో ఒక్కొక్కదాన్ని పైకి తీస్తాడు. (బొమ్మ చూడండి) నైపుణ్యంతో ప్రదర్శనం చేసినట్టయితే ప్రేక్షకులు టోపీలోనుంచి పేకముక్క పైకి వస్తున్నదనే అనుకుంటారు. పైకివచ్చే భాగంకాక, మిగిలినది టోపీలో ఉన్నట్టే వారికి భ్రమ కలుగుతుంది. పేకముక్క యావత్తూ పైకి వచ్చేశాక, ఇంద్రజాలికుడు దానిని బల్లమీద వెల్లికిలా పడేసి, ప్రేక్షకులు ఆ ముక్కను పరిశీలనగా చూసేలోపునే ఇంకొక ట్రిక్కు ప్రారంభించేస్తాడు.

—:—

# ఏడుపుకు కారణం

పూర్వం ఒకరాజు పరమదుర్మార్గుడు. ఆయనను చూసి ప్రజలు పులిని చూసినట్టు దడుచుకునేవారు. ఇక రాజభవనంలో ఉండే నౌకర్లమాట అడగనే అక్కర్లేదు; వాళ్లకు దినదిన గండంగా ఉండేది. కొంతకాలానికి ఆ రాజు కాస్తా చచ్చి పోయాడు.

ప్రజలకు పెద్దపీడ విరగడ అయిపోయింది. యువరాజు చాలా మంచివాడు, ప్రజలంటే అతనికి చాలా ఇష్టం. పరమ దుర్మార్గుడైన రాజు చచ్చి పోయినందుకూ, చాలా మంచివాడు రాజు కాబోతున్నందుకూ ప్రజలు ఎంతో సంతోషించి, ఉత్సవాలూ, ఊరేగింపులూ, విందులూ, వినోదాలూ జరుపు కున్నారు. వీటిలో కొత్త రాజుగారు కూడా పాల్గొన్నాడు.

రాజుగారు ఊరేగటానికి పల్లకీఎక్కి రాజభవనం నుంచి బయలు దేరుతుండగా ఆయనకు ఒక వింత దృశ్యం కనబడింది. రాజభవనంలోని నౌకరు ఒకడు కంటనీరు పెట్టుకుంటూ, తలపాగా కొంగుతో కళ్లుతుడుచు కుంటున్నాడు.

రాజుగారు వాణ్ణి దగ్గిరికి పిలిచి, "ఏమిరా? దేశంలో ప్రజలంతా ఆనందంలో ఓలలాడుతూంటే నువ్వు దుఃఖిస్తున్నావు. దేనికి? మా నాన్నగారు చని పోయినందుకు విచారిస్తున్నావా?" అని అడిగాడు.

దానికి నౌకరు, "లేదు, బాబయ్యా! మహారాజావారు ప్రతి ఉదయమూ మెట్లుదిగి వస్తూ, ఏ కారణమూ లేకుండానే నెత్తిన ఎనిమిది దెబ్బలు కొట్టేవారు. అటువంటి వారిప్పుడు నరకానికి వెళ్లారుగదా, అక్కడి యమ కింకరులు మటుకు ఆయనతో ఎట్లావేగుతారు. ఆయనను మళ్లీ ఇక్కడికి పంపేస్తారేమోనని ఏడుస్తున్నాను," అన్నాడు.

ఈ మాటలు విని రాజుగారూ, చుట్టూ ఉన్నవాళ్లూ గొల్లున నవ్వారు.



# కాకి - గుడ్లగూబ

బ్రహ్మదేవుడు ఒకనాడు జంతువుల నన్నిటినీ పిలిపించి, "మనుషులు క్రమపరిపాలన కింద సుఖంగా జీవించ గలందులకై రాజులను ఏర్పాటు చేసుకుంటున్నారు. మీరు కూడా ఒక రాజును ఎన్నుకోరాదా?" అని సూచన చేశాడు.

వెంటనే మృగాలన్నీ సమావేశమై సింహాన్ని మృగరాజుగా ఎన్ను కున్నాయి.

అదేవిధంగా సముద్రంలో ఉండే చేపలన్నీ చేరి అనందుడనే చేపను తమరాజుగా ఎన్ను కున్నాయి.

కాని పక్షులు అటువంటి ప్రయత్నం ఏమీ చెయ్యలేదు. ఇది గమనించి బ్రహ్మదేవుడు, పక్షులను కూడా సమావేశం జరపమనీ, ఒక రాజును ఎన్నుకోమనీ సలహా ఇచ్చాడు.

విధిలేక పక్షులు సమావేశమయాయి. రాజుగా ఉండటానికి ఎవరో గుడ్లగూబను సూచించారు.

ఈ సూచనకు కాకి అభ్యంతరం చెప్పింది. "అసలే అంతంత మాత్రం మొహం! దానికి తోడు ఆమొహాన ఆగ్రహం ప్రకటించిందంటే చూడలేక చావాలి. గుడ్లగూబ రాజుగా ఉండటానికి నేను ఎంత మాత్రం ఒప్పను!" అన్నది.

ఇది విని గుడ్ల గూబ మండిపడి కాకిని తరుముకుంటూ పోయింది. సమావేశం భగ్న మయింది. అది మొదలు కాకులకూ గుడ్ల గూబలకూ కొంచెం కూడా పడదు.





# వార్తలు-విశేషాలు

భారీ యంత్రాలను ఉపయోగించే పరిశ్రమల విషయంలో సలహాలివ్వటానికై, ఇంగ్లండు నుంచి ఒక కమీషన్ మనదేశానికి రానున్నదని, రాజ్యసభలో కేంద్ర వాణిజ్య మంత్రిచే వెల్లడించ బడింది.

*　*　*　*

అధికాహారోత్పత్తి కార్యక్రమాల నమలుపరచడానికిగాను, కేంద్రప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వాలకు ఈ సంవత్సరం 23 కోట్ల 64 లక్షల రూపాయలు మంజూరు చేసింది. ఇందులో ఆంధ్ర రాష్ట్రానికి కేటాయించబడిన మొత్తం, 5 కోట్ల 36 లక్షలు.

*　*　*　*

ద్వితీయ పంచవర్షప్రణాళిక కింద, భారతదేశంలో అయిదు కొత్త విశ్వవిద్యాలయాలను స్థాపించటానికి ఏర్పాట్లు జరుగుతున్నవి.

*　*　*　*

ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంలో 20 కిలోవాట్ల ట్రాన్స్‌మిటర్ నవంబర్ 1-వ తేదీనుంచి పనిచెయ్యగలదని, ఆలిండియా రేడియో డైరెక్టర్ జనరల్ ప్రకటించారు.

*　*　*　*

ద్వితీయ పంచవర్షప్రణాళిక కింద, దేశంలోని వివిధ ప్రాంతాలలో 7 పాలపొడి ఫ్యాక్టరీలు నిర్మించబడగలవు. ఈ ఏడు ఫ్యాక్టరీలలో రెండు ఆంధ్రదేశంలోనూ, తతిమ్మావి; బీహారు, ఉత్తరప్రదేశ్, పంజాబు, పెప్సూలలోనూ నిర్మించబడుతవి.



బెంగుళూరులోని యంత్రపరికరాల ఫ్యాక్టరీలో, ప్రస్తుతం ఒక స్విస్ కంపెనీకూడా భాగస్వామిగా ఉంది. ఇకముందు భారతప్రభుత్వం, ఈ ఉమ్మడి యాజమాన్యం తొలగించ టానికి, స్విస్ కంపెనీతో ఒక ఒడంబడిక కుదుర్చుకున్నది.

*　　　*　　　*　　　*

వరాజీ ఆర్థికశాఖా మంత్రి శ్రీ చింతామణి దేశముఖ్ గారు విశ్వవిద్యాలయ గ్రాంట్స్ కమీషన్ చైర్మన్‌గా నియమించబడ్డారు.

*　　　*　　　*　　　*

ఎయిర్ ఇండియా ఇంటర్ నేషనల్ వారు అక్టోబరు 5-వ తేదీనుంచి, ఆస్ట్రేలియాకు విమాన సర్వీసు నడప బోతున్నారు. ఈ మార్గం; బొంబాయి, మద్రాసు, సింగపూరు, డార్విన్‌లగుండా సిడ్నీ చేరుతుంది. బొంబాయినుంచి ఆస్ట్రేలియా ముఖ్య పట్టణం సిడ్నీకి 6400 మైళ్ళ దూరం ఉంది. ప్రయాణకాలం 23 గంటలు.

*　　　*　　　*　　　*

ప్రస్తుతం మద్రాసులో ఉన్న ఆంధ్రప్రభుత్వపు ఆఫీసులన్నీ నవంబర్ 1-వ తేదీకి ముందు గానే హైదరాబాదుకు తరలింపబడగలవు. ఈ సందర్భంలో హైదరాబాదుకు వెళ్ళే 3500 ఆఫీసర్ల కుటుంబాలకు, ఆంధ్రప్రభుత్వం తగు గృహవసతి ఏర్పరచేందుకు ప్రయత్నిస్తున్నది.

*　　　*　　　*　　　*

1953 జనవరిలో ఇండియా - ఇండోనేషియాలకు మధ్య జరిగిన వర్తక ఒడంబడిక గడువును మరొక ఆరు నెలలపాటు పొడిగించటానికి ఉభయ ప్రభుత్వాలూ అంగీకరించినై. ఈ ఒడంబడిక ప్రకారం మనదేశం, ఇండోనేషియాకు, బట్టలు, జనుమునార సరుకు, సుగంధ ద్రవ్యాలు ఎగుమతి చేస్తుంది. ఇండోనేషియానుంచి మనకు తగరం, కలప, రబ్బరు దిగుమతి అవుతాయి.

*　　　*　　　*　　　*

బొంబాయిలోని పాన్‌వేలునుంచి, మంగుళూరు వరకూ జాతీయ రహదారిని స్వయంగా నిర్మించటానికి కేంద్రప్రభుత్వం నిశ్చయించింది.



# చిత్రకథ





ఒకనాడు దాసూ, వాసూలు పెంపుడు పావురాయిని ఎగరవేస్తూ, కాలవ ప్రాంతాలకు వెళ్ళారు. పావురాయి, కాలవ ఒడ్డున ఉన్న చెట్టుమీదుగా ఎగురుతున్నది. ఆ సమయంలో పంగలకర్ర తీసుకుని పిట్టలు కొట్టేందుకు వచ్చిన, ఒక కొంటె కుర్రాడు, ఆ పావురాయిని గురిచూసి కొట్టబోయాడు. 'టైగర్' క్షణంలో పోయి అతడి కాలు పట్టుకున్నది. పంగలకర్రలోని రాయి గురి తప్పి, కాలవనుంచి నీరు తెస్తున్న ఒక స్త్రీ తలమీది కుండకు తగిలింది. కొంటె కుర్రాడు పారిపోయాడు. దాసూ, వాసూలుకూడా 'టైగర్'తో సహా అక్కడినుంచి పరిగెత్తారు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor: SRI 'CHAKRAPANI'







సన్‌లైట్
సబ్బు




బట్టలను తెల్లగాను, కాంతివంతముగాను ఉతుకును

S. 242-50 TL

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

కష్టా లెప్పుడు తప్పవు రన్నా !

పంపినవారు :
డి. ఎల్. సరోజిని - నిజామాబాద్

